# సంపూర్ణ అనుభవ

# హస్తరేఖా శాస్త్రము






# హస్తరేఖాశాస్త్రము - వివరణ

ఈ శాస్త్రమును మొదట సముద్రుడు చెప్పినందువలన-అనగా శాస్త్రకర్త సముద్రుడగుటచే-దీనిని సాముద్రిక శాస్త్రము అనుచున్నారని కొందరు చెప్పుచున్నారు. ముద్రికలు-రేఖలతో సహా-కూడియుండుటవలన దీనికి సాముద్రిక శాస్త్రము అనిపేరు వచ్చినట్లు కొందరు చెప్పుచున్నారు. ఈశాస్త్రము సముద్రమువలె అనంత మయినది. గావున దీనికి సాముద్రిక శాస్త్రమని పేరు వచ్చినట్లు కొందరు అర్థము చెప్పుచున్నారు.

ఈవిధముగ శాస్త్రముయొక్క పేరును గురించి భిన్నలభిప్రాయములు గలవు. సముద్రునిచే చెప్పబడిన ఈగంథ్రము, హస్తసాముద్రికమని చెప్పబడుచున్నది. విష్ణుభక్తుడయిన ప్రహ్లాదుడు కూడ ఈశాస్త్రము చెప్పెను. ఈగ్రంథము ప్రహ్లాద సాముద్రికమని వ్యవహరించబడుచున్నది సముద్రుడు, ప్రహ్లాదుడేగాక నారదుడు, గర్గు మొదలగు మహర్షులు కొందరు ఈశాస్త్రమును గురించి చెప్పియున్నారు. భవిషత్పురాణము వివేకవిలాసము, శృతులు, గరుడ పురాణము, యోగవాశిష్టము సాముద్రిక తిలకము మొదలగు అనేక గ్రంథములలో సాముద్రిక శాస్త్రవిషయములు విపులముగా చెప్పబడి ఉండెను. అట్టి గొప్ప గ్రంథములన్నియు సంస్కృతభాషలో ఉండుటచే జనసామా న్యమునకు అందుబాటులో లేవు.

పూర్వ మొకప్పుడు పార్వతీదేవికి మానవులపై అనుగ్రహము గలిగి ఈశ్వరుని జూచి "నాథా! దివ్యజ్ఞానములేని మానవులు తమ భవిష్యత్తు తెలుసుకొనుటకే దైనా ఒక విధానము తెలుప"మని కోరగా, ఈశ్వరుడు సంతోషించి, పార్వతీదేవితో సాముద్రిక శాస్త్రముగురించి చెప్పినట్టు మన ప్రాచీన గ్రంథము వలన తెలయుచున్నది. అదేయే 'హరగౌరీ సాముద్రికము'అని చెప్పబడుచున్నది. ఇంకను "సోమనాథ రేఖా సాముద్రికము'-'రమల సాముద్రికము'అని అనేక సాముద్రిక గ్రంథములు కలవు.

ఏదైనను ఒక విషయముగురించి వివరముగ తెలుపునది శాస్త్రమనబడును. అనగా జంతువుల గురించి తెలుపునది 'జంతుశాస్త్రము'అనబడును.

వృక్షముల గురించి తెలుపునది వృక్షశాస్త్రము అనబడును. ఆవిధముగనే హస్తమునందలి ముద్రికలు (రేఖాలు) గురించి తెలుపునది. గావున ఇది-'హస్త సాముద్రిక' శాస్త్రమని చెప్పబడుచున్నది. ఏది ఎట్లున్నను ఈ శాస్త్రము చాలా ప్రాచీనమైనది. అద్భుతమైనది అందువలననే మన పూర్వులు ఈశాస్త్రమును చాలా పవిత్రమయినది రహస్యమయినదిగను చాలా గోప్యముగను ఉంచెడివారు.

శాస్త్రమెంత చదివినను, దైవబలము లేనిచో ఫలితములు చెప్పుట అసాధ్యము అట్టి దైవబలము మానవులకు మంచిశీలమువలన అలవడును శీలము అనగా - సదాచారము సత్ప్రవర్తన, సత్యము తప్పకుండుట, పరోపకార బుద్ధి దైవభక్తి, మితభాషిత్వము, వినయము మొదలగునవి పాటించుట అట్టి శీలమువలన దైవబలము క్రమముగా దినాదినాభివృద్ధి చెందుచుండును అట్టి శీలము గలవానిని చూచి మన పూర్వీకులు ఈ శాస్త్రమును నేర్పుచుండెడివారు అయోగ్యులకు అనగా అట్టి మంచి గుణశీలములు లేనివారికి ఈశాస్త్రమును బోధించెడివారుకారు మొత్తంమీద మనం తెలుసుకొనవలసినది ఏమనగా దైవ బలములేనిదే ఈశాస్త్రమును ఎంత చదివినను ఫలితము చెప్పుట అసాధ్యము.

ప్రస్తుత కాలములో మనదేశములో యీశాస్త్రము చాలవరకు అంతరించు నట్లు చెప్పుచున్నారు. అందులకు కొన్ని కారణములు గలవు. పూర్వము ఆరు -ఏడు శతాబ్దముల క్రితము తురకలు మనదేశముపై దండెత్తి వచ్చినప్పుడు, అనేక శాస్త్ర గ్రంథములను వారు నాశనము చేసినట్లు చెప్పబడుచున్నది. అది చాలావరకు యదార్థము అయి ఉండవచ్చును. మరియు పూర్వము మహా రాజులు యీశాస్త్రమును విశేష అభిమానముతో పోషించెడివారు. అనగావారు ఈ శాస్త్రజ్ఞులను గౌరవముగా చూచుట. వారికి తగిన ధనసహాయం చేయుట భూములు-అగ్రహారములు-ఈనాములుగ ఇచ్చుట మొదలగు అనేక సహా యములు చేసెడివారు. కాని నేడు అట్టి మహారాజులు లేరు. రాజ్యములు అంతరించెను. రాజులు అంతరించిరి. అట్టి మహారాజుల సహాయము లేక పోవుటచే ఈ శాస్త్రమును అభ్యసించుట అంతగా ఉత్సాహము లేకపోయెను అందుచే ఈ శాస్త్రపోషణ యిర ప్రజలపై ఆధారపడి యుండెను. కనుక యిక ప్రజలే ఈ కర్తవ్యములు నెరవేర్చవలసియున్నది.



శాస్త్రము బాగుగాచదివి అర్థముచేసుకొనక శాస్త్రము అసత్యమని చెప్పుట అజ్ఞానము అవివేకముతో కూడుకొనునదియు పశుత్వమును అయిన విషయము. మొత్తముమీద యీశాస్త్రము చాలాప్రాచీనమైనదిగను నూటికి నూరుపాళ్లు సత్యమైనదిగను మనము తెలుసుకొనవలయును మనదేశములో మిగిలిన శాస్త్రములన్నియు ఎప్పుడు పుట్టినవో, ఈశాస్త్రముకూడా అప్పుడే పుట్టియుండవచ్చును.

జ్యోతిషశాస్త్రము వేదములో చెప్పబడినదని అందురు జ్యోతిష శాస్త్రమున కును, సాముద్రిక శాస్త్రమునకును, విశేష సంబంధముకలదు అందుచే జ్యోతిష శాస్త్రమువేదములకు సంబంధించినది కావున ఈ సాముద్రిక శాస్త్రముకూడ వేదకాలమునాటిదేయని చెప్పుట తప్పుగాదు ఒప్పేయగును. ఆవిధముగా పాశ్చాత్తదేశములనుండి మనదేశమునకు వచ్చి ఈశాస్త్రమును నేర్చుకొనిన వారిలో "షీరో"ముఖ్యుడు. మనదేశమునకు వచ్చి, కాశ్మీరు దేశములో బ్రాహ్మ ణులను ఆశ్రయించి ఈశాస్త్రమును నేర్చుకొని తిరిగి ఇంగ్లాండుపోయి అక్కడ ఈ శాస్త్రములను చాలా ప్రచారము చేసెను. ఈ విషయమంతయు "షీరో" ఇంగ్లీషులో తాను వ్రాసిన సాముద్రిక గ్రంథములలో బాగుగా వివరించెను.



హస్తములోని ముఖ్యరేఖలు

మనదేశములో ఈ సాముద్రిక శాస్త్రమును మన పూర్వులు సంస్కృత శ్లోకములో వ్రాసిరి. ఈకాలములో సంస్కృతము వచ్చినవారు చాలా తక్కువ అట్టి కారణంచేత కూడ యీశాస్త్రము మనదేశములో చాలా అడుగంటి ఉండ వచ్చును. ప్రస్తుతములో మనదేశమున సంస్కృత గ్రంథములు ఒకటి, రెండు మాత్రమే వున్నవి. ఆ గ్రంథములలో యున్న విషయములు సామాన్యులకు అర్థమగుచుండుట లేదు, ఆ గ్రంథములలో మత్స్యరేఖ యూపరేఖ స్వస్తికరేఖ డమరకము, ఛత్రము, చామరము అని పూర్వులు అరచేతిలో నుండు రేఖలకు పేర్లు పెట్టిరి కాని రేఖలు చేతులలో గుర్తించలేక శాస్త్రముపై నమ్మకము వదలిరి.

పాశ్చాత్యదేశములలో ఇంగ్లీషుభాషలోవున్న సాముద్రిక గ్రంథములను తెప్పించుకొని వాటినిబట్టి సాముద్రిక ఫలితములు తెలుసుకొనుచున్నాము. ఈ విధముగ మనదేశములో మన సాముద్రిక శాస్త్రము యించుమించు అంత రించి మనము పూర్తి పాశ్చాత్య గ్రంథములపై ఆధారపడవలసిన కాలము వచ్చి నది యిది బహుశోచనీయము.

# ఆయుష్య రేఖ

శ్లో॥ పూర్వమాయుః పరీక్ష్యైవ పశ్చాల్లక్షణ ముచ్యతే
ఆయుర్హీనా నరాణాంతు లక్షణైః కిమ్ ప్రయోజనమ్॥

## (భవిష్యత్పురాణము)

అరచేతిలో రేఖలుచూచి ఫలితములు చెప్పునప్పుడు - మొదట అయుర్దాయము నిర్ణయించి. తరువాత ఫలితంలు చెప్పవల యును మానవునకు ఆరోగ్యము, ఆయుర్దా యము ఈ రెండునూ ముఖ్యావసరములు ఈ రెండు విషయములు ఆయుష్య రేఖను బట్టి తెలుసుకొనవలయును. (ఆయుష్య రేఖ బొమ్మ) పైన గల హస్తము బొమ్మలో ఆయుష్య రేఖను గమనించగలరు.



1



ఆయుర్దాయమే లేనపుడు, చేతిలో ఎన్ని రేఖలున్ననూ ప్రయోజనములేదు. ఆయుష్యరేఖకు ముందుగా అరచేతిలోని స్థానములు ముఖ్యమయినరేఖలు వ్రేళ్ళు- మొదలగు వాటిని గురించి అతంగా, హస్తమునందుగల కొన్ని వివరములను తెలుసు కొనవలయును.

**1. చూపుడువ్రేలు** :- దీనినే గురువ్రేలుఅని అందురు. 2. గురువ్రేలు ప్రక్కవేలు అనగా రెండవవ్రేలె (బొటన వ్రేలుతో లెక్క మొదలుగాదు) శని వ్రేలు, 3. శని వ్రేలు ప్రక్కవ్రేలు రవివ్రేలు, 4. రవి వ్రేలు ప్రక్క వ్రేలు, బుధ వ్రేలు దీనినే చిటికెన వ్రేలు అని కూడా అందురు. తదుపరి బొటన వ్రేలు.

**గురువ్రేలు** :- దీనిక్రింద భాగము గురుస్థానముగా తెలుసుకొనవలెను.

**శనివ్రేలు** :- దీని క్రింద భాగమున శనిస్థానముగ గ్రహించవలెను.

**రవివ్రేలు** :- దీని క్రింద భాగము రవిస్థానము.

**బుధవ్రేలు** :- దీని క్రింద భాగము బుధస్థానము.

**బొటనవ్రేలు**:- క్రింద భాగము శుక్రస్థానము.

**బుధస్థానము**:- క్రింద భాగము కుజస్థానము.


2

దీనినే మొదటి కుజస్థానము అనికూడా తెలుసుకొనవలయును. ఈ మొదటి కుజస్థానము క్రిందభాగమే చంద్రస్థానం, గురుస్థానం క్రిందుగను, బొటనవ్రేలుకు కుడిప్రక్కనను గల స్థానము-రెండవ కుజస్థానము. మొదటి కుజస్థానము రెండవ స్థానము మధ్యన అరచేయి మధ్యన అయిన స్థానమును మధ్య కుజస్థానము అని తెలుసుకొనవలయును (వ్రేళ్ళువాటి స్థానములు ప్రక్కన గల బొమ్మను చూచి గుర్తించగలరు.

# అరచేతిలో ముఖ్యమయిన రేఖలు

అరచేతిలోని రేఖలలో ఆయుష్య రేఖ, ధనరేఖ, శిరోరేఖ, ఆత్మరేఖ, రవిరేఖ బుధరేఖ వివాహరేఖలు అనే 7 రేఖలను ప్రధానమైన రేఖలుగా చాలాముఖ్య మయినవిగా తెలిసికొనగలరు. ప్రక్కన గల బొమ్మను చూడండి.


హస్తములోని ముఖ్యరేఖలు

**ఆయుష్యరేఖ:-** ఈరేఖ, బొటనవ్రేలు కుడిప్రక్కనగల రెండవ కుజ స్థానముపై నుండి ప్రారంభమై శుక్రస్థానమును అర్ధ చంద్రాకారముగా చుట్టుచూ, అర చేయి దిగువునగల కంకణరేఖలను తాకును ఈరేఖ పుట్టుక 7,8 విధములుగా వుండును. దీనిని జీవితరేఖ, లేక ఆయు ష్యరేఖ అనికూడా అందురు. ఈ రేఖను బట్టి ఆయుర్దాయమును తెలియును.


3

3వ బొమ్మను చూచి తెలుసుకో గలరు జాతకునకు యోగములు ఎన్ని వున్నను ఆయుర్దాయమే ప్రధాన మయిన యోగముగా చెప్పబడెను. ఈరేఖకు ఎక్కువ ప్రాముఖ్యము యిచ్చి వున్నారు.

**కంకణరేఖలు:-**అరచేయి క్రిందుగా ఒకదాని క్రిందమరొకటిగా అడ్డముగా ఈ రేఖలు 2, 3 వరసలుగా వుండును. వీటిని మణిబంధన రేఖలు అనియు కంకణరేఖ అనియు అందురు. 4వ బొమ్మను జూసి తెలుసుకోగలరు.


4



**ధనరేఖ:-** ఈరేఖ అరచేయి దిగువ భాగమున అనగా కంకణరేఖ పైనుండి ప్రారంభమై శనిస్థానము వరకు వ్యాపించి వుండును. దీనిని భాగ్యరేఖ, అదృష్టరేఖ ధనరేఖ-అని అందురు. ఆయుష్యరేఖ తదుపరి యీభాగ్యరేఖకు ప్రాముఖ్యత యిచ్చియున్నారు. 5వ బొమ్మలో ధనరేఖను చూడగలరు.


5

**శిరోరేఖ:-** గురుస్థానము రెండవ కుజ స్థానములకు మధ్యగా ప్రారంభమయి చంద్రస్థానముమీదకు వ్యాపించును. 6,7 విధములుగా ఈరేఖ పుట్టుక వుండగలదు. దీనిని శిరోరేఖ లేక బుద్ధిరేఖ - అనికూడా అందురు.

6వ బొమ్మలో యీ రేఖను పరిశీలించి చూడగలరు.


6

**వివాహాది రేఖలు:-** బుధస్థానమున, చేతి చివర అంచునుండి అడ్డముగా వ్యాపించు చుండు రేఖలను వివాహరేఖలు అని అందురు.

**ఆత్మరేఖ:-** బుధస్థానము క్రిందుగా మొదటి కుజస్థానముపై ఆరంభమయి గురుస్థానము వరకును వ్యాపించును. 7,8 విధములుగా ఈ పుట్టుకవుండును. దీనిని హృదయరేఖ లేక ఆత్మరేఖ అని కూడా అందురు. ఈరేఖను బట్టి జాతకుని మనోధృక్పధము మొదలగు హృదయసంబంధమైన విషయములు తెలియును. 7వ బొమ్మను చూడగలరు.


7

**బుధరేఖ :-** బుధస్థానమునుండి ప్రారంభమై, దిగువనగల చంద్ర, శ స్థానములమీదకు క్రిందుగా వ్యాపించును. దీనిని వ్యాపారరేఖ లేక బుధ అని అందురు. ఈరేఖ వ్యాపారము శాస్త్రజ్ఞానము మొదలగు విషయముల తెలియజేయును.

**రవిరేఖ:-** ఈరేఖ చంద్రస్థానము నుండియు, ధనరేఖ ప్రక్కగా ఆరంభమై రవిస్థానములు చేరును. ఇది 7, 8 విధములుగా పుట్టును. దీనిని రవిరేఖ అనియు కీర్తిరేఖ అనియు, సూర్యరేఖ అనియు కూడా అందురు. హస్తము లోను, వివిధ రేఖలపైననూ వివిధ ఆకారములలో ఉండు రకరకముల గుర్తులు గమనించ గలరు.




1. నక్షత్రము
2. త్రికోణము, త్రిభుజము
3. మచ్చలు
4. చతురము
5. జల్లెడ రేఖలు
6. వలయరేఖలు
7. కత్తెర
8. త్రిశూల రేఖలు
9. లంకగుర్తులు, లేక వడ్లగింజ రేఖలు
10. మత్స్య రేఖ
11. పద్మము
12. శంఖము
13. ఖడ్గము
14. ధ్వజరేఖ
15. ఛత్రము




యివిగాక యింకనూ నూట అరవై గుర్తులుగల రేఖలు సుమారుగా ఉండు అపైన యివ్వబడిన గుర్తులకు ఫలితములు వివిధ రేఖల వివరములో తెలి కానగలరు. పైన గల బొమ్మను పరిశీలించిన, అర్థమగును పైనగల బొమ్మ చూడగలరు.



॥ ఆయుర్బలం భవేద్రేఖా తరనీ మూలసంస్థితా ॥
శతవర్షం భవేదాయుస్సుఖమృత్యుర్న సంశయః (గరుడ పురాణము)

ఆయుష్యరేఖ తర్జనీ అంగుష్ఠముల మధ్య ప్రారంభమై కుజ శుక్ర స్థానము ను చుట్టి, మణికట్టు రేఖలకు సమీపమున అంత్యమగుచుండును. అరచేతిలో యుండు రేఖలన్నిటిలో ఇది ప్రధానమైన రేఖగా పరిగణింపబడుచున్నది. ఇది వలం ఆయుర్దాయముననే కాక తన భావమునకు సంబంధించిన విషయము న్నింటిని తెలుపును.

అనగా శరీరమునకు సంబంధించిన ఆరోగ్యము ప్రమాదములు, అంగవై ల్యము, అనివార్యములైన దీర్ఘరోగలు మొదలగు వాటినన్నిటిని గురించి లుపును. ఈరేఖ రెండవ కుజ, శుక్రస్థానములను చుట్టి గులాబీ పుష్పమువంటి రుపురంగు కలిగి, ప్రకాశవంతమై లోతుగను-ధృడముగను-దీర్ఘముగను యున్నచో, జీవితకాలమంతయు ఆయురారోగ్యైశ్వర్యాదులతో సుఖముగా డుపగలరు. ఆయుష్యరేఖని దారమువలె సన్నముగా యుండవలయును. ఈరేఖ సన్నముగయున్న కుశాంక బుద్ధిగలవారగుదురు రేఖ సన్నముగా ఉండి, కాంతివంతముగయున్న చురుకుదనము కలవారుగను, మేధావియును కార్యసాధకులుగను అగుదురు.

ఈరేఖ వెడల్పుగా యున్నచో పశు బలంకలవాడై మొరటుదనముగా శరీర కష్టమువల్ల జీవించుచూ కూలిపని సేవకా వృత్తి మొదలగు వృత్తులవలన జీవించు వాడగును. మిక్కిలి వెడల్పుగా యున్నచో మందబుద్ధికలవాడై ఇతరులు చెప్పిన పనులు చేయుచుండును. అనగా యితరుల ఆజ్ఞానువర్తియై సేవకావృత్తిలో జీవితము గడుపు చుండును. ప్రక్కనగల 9వ బొమ్మను చూసి తెలుసుకొగలరు.



ఆయుష్యరేఖ శుక్రస్థానముపై భాగములో శుక్రస్థానము మీద ప్రారంభమగుచూ, అనగా బొటనవ్రేలునకు దగ్గరగా ప్రారంభమయినచో అల్పజ్ఞానము కలవాడును మధ్యయాయుర్దాయము కలవాడును అగును. 10వ బొమ్మను చూడగలరు. అట్టి వ్యక్తికి స్త్రీవాంఛ తక్కువగా యుండును.


10

దీనికితోడు చేతిలో గురు, శుక్రస్థానములు బలహీనముగా అనగా పల్లపుగనూ వుండియుండి, అనగా లోతుగాయున్నను శుష్కించినట్లున్నను నపుంసకుడగును.

ఆయుష్యరేఖ తర్జనీ అనబడు చూపుడు వ్రేలునకు (గురువ్రేలుకు) సమీపంలో గురుస్థానం మీద ప్రారంభమగుచున్న యెడల రాజకీయనాయకుడగును లేదా గవర్నమెంటులో గొప్ప ఉద్యోగము చేయుచూ, ఉన్నతమయిన పదవులు పదవులలోనూ గొప్పవారితోను స్నేహంతో బంధుత్వముతోను ఉండును.


11

గురు, శుక్రస్థానములు ఉన్నతంగా యుండి లంక గుర్తులు, కత్తెరలు మొదలగునవి లేకుండా విపులముగా ఉండవలయును. 11వ బొమ్మచూడండి.

ఆయుష్యరేఖలో పుట్టిన ఒక శాఖరేఖ అధోముఖముగ (అనగా క్రిందుగా వ్యాపించుచూ చంద్రస్థానంమీదకు వ్యాపించియున్నచో - అట్టి వ్యక్తి జన్మస్థానమును వదలి దూరదేశములకు పోయి అక్కడ నివసించును. 12వ బొమ్మ చూడగలరు.


12



ఆయుష్యరేఖ మీదపుట్టిన రేఖలు అధోముఖముగ క్రిందకు వ్యాపించి చంద్రస్థానము మీదకు వ్యాపించుచున్నచో, ఆయుష్యరేఖపై ఆ రేఖలు బయలుదేరుచున్న స్థానమును బట్టి వయస్సు నిర్ణయించి, ఆయావయస్సులో ఆవ్యక్తి దూరదేశములకు ప్రయాణము చేయునని తెలుసుకొనవలయును. ఈ ప్రయాణ రేఖలు బాగుగా చంద్రస్థానము మీదకుగాని, చంద్రస్థానముయొక్క చివరి అంచువరకుగానీ వ్యాపించి యున్నచో అట్టివారు సముద్ర ప్రయాణము చేసి, దూరదేశములకు పోవుదరని తెలుసుకోవలయును. ఇది గొప్పయోగము. హస్తమునందు యిటువంటి రేఖయుండుట గొప్పవిశేషము, వ్యాపార సంబంధమైన ప్రయాణములు చేయుదురు.

ఆయుష్యరేఖ చివరిలో మణికట్టునకూ సమీపములో, రెండు రేఖలుగా చీలియున్నచో, వృద్ధావ్యములో అనివార్య మయిన దీర్ఘరోగమునకు లోనై శరీరసౌఖ్యంపొందలేక బాధపడును. దీనికి తోడు వ్రేళ్ళగోళ్ళు చిన్న చిన్నవిగా వుండి నల్లటివి గాయుండి. గోళ్ళపై చంద్రవంక ఆకారములో తెల్లని మచ్చలున్నచో పక్షవాతము,మూర్ఛ మొదలగు శరీర పీడలు కలుగును. 13వ బొమ్మను చూచి తెలుసుకొనగలరు.


13

**ఊర్ధ్వరేఖలు** :- ఆయుష్య రేఖమీద పుట్టినరేఖలుపైకి ఊర్ధ్వముఖముగ వ్యాపించియున్నచో ఆరేఖలు పుట్టిన వయస్సులో, తాను చేయుచున్న కార్యములు విజయములుపొందుచూ ఆ విధముగా విశేష అభివృద్ధిని, సంపదలను అర్జించువాడగును. ఆ వ్యక్తి ఉద్యోగము చేయుచున్నను అతిసులభముగ ఉన్నతపదవులు పొందు


14

చుండును. అట్టి ఊర్ధ్వరేఖలు అనగా ఆయుష్యరేఖమీద పుట్టి ఊర్ధ్వ ముఖ్యముగాపైకి వ్యాపించుచూ, గురు, శని,రవి-బుధస్థానములమీదకు వ్యాపించి యున్నచో అయాస్థానములకు సంబంచిన విషయములో ఉన్నతమైన కీర్తినిపొంది, విశేష ధనసంపాదనయును ప్రజాసన్మానమును పొందుదురు. 14వ బొమ్మను చూడండి.

ప్రక్కనగల బొమ్మలో చూపినట్లు ఇట్టి ఊర్ధ్వరేఖలపై యితరరేఖలు అడ్డముగ వ్యాపించి, ఖండిచుచు న్నట్లును కత్తెరవలెను యున్నచో ప్రయత్న కార్యము లకు భంగములు విఘ్నములు ఆటంక ములు, నష్టములు కలుగు చుండును. 15వ బొమ్మను చూడగలరు. ఆయుష్యరేఖ ఎక్కడ యినను తెగినచో ఆకాలములో


15

మరణము కలుగును. ఆవిధముగ తెగి యున్నచో ఇతరరేఖలచే కలపబడు చున్ననూ లేదా ఆమధ్య ఒక చతురమున్ననూ-ఆ తెగినరేఖ ఒక దానిపైకొకటి వ్యాపించినట్లున్ననూ. ప్రమాదమునుంచి బ్రతికి బయట పడగలుగుదురు.

కొందరి హస్తములలో ఆయుష్యరేఖ నుండి క్రిందభాగంలో మరియొక రేఖ బయలుదేరి బుధ స్థానంమీదకు వ్యాపించి యుండును. ఇది ఆర్యోగరేఖ యని చెప్ప బడెను. ఇట్టి ఆరోగ్యరేఖ చేతిలో ఉండుట మంచిదికాదు 16వ బొమ్మను పరిశీలించ గలరు.


16

అట్టి ఈ రేఖయున్నచో జీవితకాలములో తరచుగా అనారోగ్యములచే బాధపడుచుందురు. ఈరేఖ బలముగ యున్నచో అనివార్యమయిన క్షయ, మూర్ఛ, పక్షవాతము, నరములబలహీనత సవాయి మొదలగు సుఖవ్యాధుల వలనను బాధపడుచుందురు. అట్టి ఆరోగ్యరేఖ ఆయుష్యరేఖ మీద పుట్టినచోటు ఏవయస్సుఅగునో, ఆవయస్సులో మరణముకూడా కలుగును లేదా ఆ వయసు



నుంచి శరీరమునందు అనారోగ్యము వృద్ధియై నిత్యమును బాధాకరముగ ఉండును. కాని ఈ ఆరోగ్యరేఖ పుట్టినచోటునుంచి, తరువాత ఆయుష్యరేఖ ధృడముగ వున్నచో మరణము కలుగుచుండుటలేదు. యీ ఫలితమును కూడా గమనించుతూ యుండవలెను.

చేతిలో ఆరోగ్యరేఖ బలముగ యుండి ఆయుష్యరేఖ బలహీనముగా యున్నచో దుర్బలుడగుటయేగాక అనారోగ్యలచే సదా పీడింపబడు చుండును. 17వ బొమ్మను జూడగలరు. ఆరోగ్యరేఖకంటే ఆయుష్య రేఖబలంగా యున్నచో అనారోగ్యములను లెక్కచేయక, తన నిత్యజీవిత కార్యక్రమము


17

లను నిరాటంక ముగా నెరవేర్చుకొన గలుగుచుండును. చేతిలో ఊర్ధ్వరేఖలు అభివృద్ధిని సూచించును. కాని, ఈఆరోగ్యరేఖను అధోరేఖగా భావించ వలయును. అందుచే దీనిపై వయస్సు చూచునపుడు, బుధస్థానమునుంచి ప్రారంభించి ఆయుష్య రేఖనును కలిగియునంతవరకు జూడవలెను. ఏమైననూ ఈ ఆరోగ్యరేఖ చేతిలో నుండుట అసుభములను అనారోగ్యములను సూచించునేగాని శుభములను యోగములును సూచించదు హస్తములో ఈ రేఖ వుండలేకపోవుటయే మేలు.

ఈ ఆయుష్యరేఖ శుక్రస్థానమును పూర్తిగచుట్టి వ్యాపించక, కొంతవరకు వ్యాపించి యున్నచో ఆ కాలములో మరణం కలుగు చుండును. 18వ బొమ్మను జూడగలరు.

ఆయుష్యరేఖ కొంతభాగము వెడల్పు గను-కొంతభాగము నల్లని మచ్చల తోను కొంతభాగం గొలుసుకట్టువలెను. కొంత భాగము


18

అడ్డురేఖతోను-ఈవిధముగా వివిధరూపముల దోషయుక్తముగ నున్నచో, తరచు వ్యాధులచే బాధపడు చుండును లేదా జీవితకాలమంతయు దౌర్బల్యముచేతను అనివార్యలయిన అనారోగ్యముచేతను బాధపడుచుందురు.

ఆయుష్యరేఖపై చిన్నచిన్న అడ్డముగ రేఖలు వ్యాపించియున్నచో శరీ
దౌర్బల్యముచేతను తరచుగా వచ్చుచూ పోవుచుండు మలేరియా జ్వరము
మొదలగు రోగములచేతను వివిధరకముల వ్యాధులవలినను బాధపడు
చుందురు. ఆయుష్యరేఖ అరచేతిలోపైభాగమున అనగా అరచేయి కుడిభాగ
లో గురు(రెండవ)వ్రేలునకు కుజస్థానములమధ్య భాగములో ప్రారంభమై అర్ధ
చంద్రాకారముగా శుక్రస్థానమును కట్టుచు మణికట్టువరకు వ్యాపించియు
డును. ఈరేఖ ఆవిధంగా వ్యాపించి ఏవిధములయిన దోషంలేక సన్నముగను కాంతివంతముగా యుండి, యిటువంటి ఎరుపురంగులో యున్నచో పూర్ణా యుర్దాయము కలవారగును. అనగా 100 లేక 120 సంవత్సరముల ఆయుర్దాయము కలవార గును. జీవితకాలమంతయు ఆరోగ్యముగ వుందురు. ప్రక్కన గల 19వ బొమ్మను పరిశీలించగలరు. ఈ రేఖపై వయస్సు చూచునపుడు పైనుండి లెక్క చూడవల యును. అనగా చూపుడువ్రేలు బొటనవ్రేలు మధ్య ఈరేఖ బయలుదేరిన స్థానమునుంచి క్రిందకు అనగా మణికట్టువరకూ లెక్క చూడవలయును.


19

కొందరి హస్తములలో ఈ రేఖకు లోపలి భాగమున ఈరేఖవలెనే అర్ధ చంద్రా కారముగ వేరొకరేఖ వ్యాపించి యుండును. అట్టి ఈరేఖ కుజరేఖ అని చెప్పబడుచున్నది. ఇది రెండవ ఆయుష్య రేఖవలె వర్తించును. ప్రక్కనగల 21వ బొమ్మను చూడగలరు. ఈ కుజరేఖ ఖండఖండలుగా వుండక అర్ధచంద్రా కారముగా ఆయుష్యరేఖ లోపల వ్యాపించి యున్నచో ఈరేఖ ఆయుష్యరేఖలో యున్న దోషములనుండి కాపాడుచు


20



ఆరోగ్యమును ధృడమయిన శరీరమును పూర్ణాయుర్దాయము కలుగజేయును. ఇట్టి కుజరేఖలవారు సహజముగ ధైర్య వంతులుగను, సాహసవంతులుగను యుండి, సకలకార్యదురంధలుగ యుండి, జీవితములో ఉన్నతస్థితిలో యుందురు. చేతిలో ఈ రెండవ ఆయుష్యరేఖ అనబడు ఈకుజరేఖ వుండుట ఒకఅదృష్టము గొప్పయోగము వీరు జీవితమును కడు సమర్దనీయముగా ఎదుర్కొనగలరు.

మరికొందరు చేతులలో ఒకరేఖ శని స్థానము మీదపుట్టి ఏటవాలుగ క్రిందకు వ్యాపించి ఆయుష్యరేఖను తాకి అక్కడ ఆగి పోవును. ఈరేఖను శని రేఖయని పేరు. ప్రక్కన గల 22వ బొమ్మను చూడండి ఈరేఖ ఆయుష్యరేఖను ఎక్కడతాకునో, ఆవయస్సులో కారాగాశిక్ష పొందుట మరణశిక్ష, ఆత్మహత్య, ఆకస్మిక మరణము. అవమానముతోకూడిన మరణము, యుద్ధభూమిలో మరణించుట, ప్రమాదములలో మరణించుట,మొదలగు వాటిని సూచించును చేతిలో యిట్టి రేఖ ఉండుట దురదృష్టమనే చెప్పవలెను.


21

## ఊర్ధ్వరేఖలు

హస్తములో రేఖలు క్రిందిభాగమునుండి పైభాగమువరకు వ్యాపించుచూ క్రిందభాగమున వెడల్పుగ యుండి పైకి వ్యాపించినకొలది సన్నమగుచు చివరి భాగములో తలవెంట్రుకవలె సన్నముగ అంత్యమగురేఖలు ఊర్ధ్వరేఖలు అనబడును. హస్తములో ఊర్ధ్వరేఖలు ఉండుట అదృష్టము ఈ రేఖలు శుభములను సంపదలను మంచి యోగములను అభివృద్దిని సూచించును. ప్రక్కన గల 23వ బొమ్మలో ఊర్ధ్వరేఖలను గమనించి తెలుసుకోగలరు.


22

# అధోరేఖలు

హస్తములో రేఖలు పైభాగమునుండి క్రింద వ్యాపించుచూ పైభాగమున వెడల్పుగ, లావుగయుండి క్రిందకు వ్యాపించినకొలది సన్నమగుచు, చివరి భాగములో తలవెంట్రుకవలెయుండి, సన్నముగ అంత్యమగు రేఖలు 'అధో రేఖలుగ అనబడును.

ఈ రేఖలు అశుభములను, కష్టములను సూచించును. అనారోగ్యము, ఆస్తినష్టము, ధననష్టము కూడా కలుగును. రెండవ కుజస్థానము మీద అనగా -గురు-శుక్రస్థానములకు మధ్య నున్న స్థానముపై నక్షత్రంవంటి గుర్తువున్నచో కారాగృహశిక్షను సూచించును 24వ బొమ్మను చూడగలరు.

ఆయుష్యరేఖ మణికట్టు వరకు వ్యాపించక, మధ్యలో ఆగిపోయినచో ఆ వయస్సులో మరణము కలుగును. ఈ విధముగ ఈఆయుష్యరేఖను పరిశీలించు నపుడు రేఖపొడవు-వెడల్పు- సన్నముగా యున్నదా? మిక్కిలి వెడల్పుగా యున్నదా? రేఖ యొక్క రంగు ఎట్లున్నది? రేఖ ఎక్కడ యిననూ గొలుసువలె యున్నదా? రేఖపై కత్తెరలు మొదలయిన గుర్తులు వున్నవా? రేఖ ఎక్కడయి ననూ తెగియున్నదా? ఈ రేఖమీద పుట్టినరేఖలు ఊర్ధ్వముఖముగ వ్యాపించి యున్నవా? అవి ఎంతవరకు,ఎక్కడివరకు ఊర్ధ్వముఖముగా వ్యాపించియున్నవి. యిత్యాదిఎన్నియో విషయములు బాగుగా తెలుసుకోవలెను. రేఖపై నల్లని పుట్టుమచ్చలువున్నవా రేఖపై అడ్డరేఖలు వ్యాపించియున్నవా.


23

అను సమస్త విషయములనూ బాగుగాపరిశీలించి, తమభావమును, అనగా శరీరమునకుసంబంధించిన ఆరోగ్యము స్వభావము మొదలగు విషయములు తెలుసుకొనవలయును.



## ఆయుష్యరేఖ గురించి

1. కళావిహీనముగను, లోతులేక మిక్కిలి వెడల్పుగను యున్నచో అనా రోగ్యము, దుర్బలశరీరము అజ్ఞానముతోకూడిన మోటుస్వభావముగా తెలుసు కోవలయును.
2. లోతుగను, ఎరుపురంగును ఉన్నచో - కలహ స్వభావము దుష్టస్వభావము - అనగా పశుత్వముగా నుండునని తెలుసుకోవలయును.
3. రేఖలో కొంతభాగము సన్నముగాయున్నచో ఆసన్నముగవున్న భాగము నకు సంబంధించిన కాలములో అనారోగ్యమని యెరుంగవలెను.
4. గొలుసువలె ఉన్నను - ముక్కలు ముక్కలుగ యున్నను - దీర్ఘ అనారోగ్యము.
5. గురుస్థానము క్రింద గొలుసువలెయున్నచో బాల్యములో దీర్ఘ అనా రోగ్యము.
6. రేఖ విములముగాను - కాంతిగాను ఉండి, గురుస్థానము క్రిందపుట్టి, శుక్ర స్థానమును అర్ధచంద్రాకారముగ చుట్టుచూ మణికట్టువరకూ వ్యాపించి యున్నచో పూర్ణాయుర్దాయము కలుగును. అనగా 109 సంవత్సరములు జీవించును.
7. ఈ రేఖ అరచేతిలో పైభాగమును గురుస్థానము మీదనుంచి ప్రారంభ మగుచున్నచో-జీవితములో ఉన్నతస్థితి కలుగును. ప్రజాసన్మానములు కీర్తి దేశవ్యాప్తమయిన పేరూ కలుగును.
8. ఈరేఖ మధ్యలో ఎక్కడయినను ఆగిపోయి అడ్డముగా రెండు చిన్న రేఖలువున్నచో- ఆ వయస్సులో అకస్మిక మరణము కలుగును.
9. ఎక్కడయినను తెగి, కొంతభాగము నిచ్చెనమెట్లవలె వున్నచో - ఆ వయస్సులో కొంతకాలం అనారోగ్యముచే బాధపడును.
10. మధ్యలో ఎక్కడయినను పూర్తిగా తెగియున్నచో ఆవయస్సులో మరణము కలుగును.

11. ఆయుష్యరేఖ ప్రారంభములో శిరోరేఖతో పైన వేసుకుని కలిసివున్నచో ప్రతివిషయము నందును. సందేహములతో ఆలోచించుచూ, ఏవిషయమును చొరవగ చేయులేక, ఆలోచించుచూ, అవమానించుచూ పిరికితనముతో ఆర్తించుచూ సాహసముగా ఏమియు చేయలేని వాడగును. 24వ బొమ్మను పరిశీలించి తెలుసుకోగలరు.


24

12. ఆయుష్యరేఖ ప్రారంభములో శిరోరేఖ, ఆత్మరేఖలతో కలిసియుండి ఈ మూడు రేఖలు ఒకదానితో మరియొకటి పెన వేసుకొనినట్లుండిన దురదృష్టమును బలన్మరణమును సూచించును. 25వ బొమ్మను బాగుగా పరిశీలించ గలరు.


25

13. శిరోజరేఖ, ఆయుష్యరేఖలు ప్రారంభము లో ఒకదానిలో యొకటి కలయిక సామాన్యమయిన స్వల్పదూరములో యుండుట మంచిది. కార్యాచరణశక్తి ధైర్య సాహసములు, చురుకుతనము కలుగును. ప్రక్కనగల 26వ బొమ్మలో తేడాను జూడగలరు. యీ ఆయుష్యరేఖకు ఎక్కువ ప్రాముఖ్యము ఇచ్చి నందువలన ఫలితములు ఎక్కువగా చెప్పబడెను.


26

14. ఈరేఖ ప్రారంభంలో స్వల్పముగ పంగల కర్రవలె రెండుశాఖలుగ చీలి యున్నచో మంచి ప్రవర్తన, సదాచారములు, వేదాంత జ్ఞానము కలుగజేయును. 27వ బొమ్మను చూడండి.

15. ఆయుష్యరేఖ చివరిభాగమున చీలివున్నచో- సంపాదన్ నిలువచేయలేక ఎప్పుడు సంపాందించినది అప్పుడే ఖర్చు చేయుచుండును.


27



16. ఆయుష్యరేఖ మీద పుట్టిన ఒకశాఖ గురు స్థానములమీదకు వ్యాపించి యున్నచో రాజకీయరంగములో మంత్రి మొదలగు ఉన్నతపదవులను పొందగలుగుదురు. దిగువనున్న 28వ బొమ్మను పరిశీలించి జూడగలరు. ఒకసారి స్వయంగా ఒక మంత్రిగారి హస్తమును చూడగా అయన చేతిలో ఆయుష్యరేఖ పై ఒకరేఖ పుట్టి గురుస్థానము మీదకు వ్యాపించి యున్నది. గురుస్థానము సువిశాలముగ యుండి ఉచ్ఛగాయున్నది మరియు ఆ గురు స్థానముపై నాలుగు చతురపుగుర్తులు స్ఫుటముగానున్నవి. ఈగుర్తులు మంచియోగము. మరియొక మంత్రి హస్తంలో స్థానములు అన్నియు ఉచ్ఛగాయున్నవి. రవిస్థానముమీద త్రిశూలరేఖ, గురు స్థానముమీద మరియొక త్రిశూలరేఖ వుండి, ఆయుష్యరేఖ నుండి పుట్టిన ఒక ఊర్ధ్వరేఖ రవిస్థానము మీదకు స్ఫుటముగా వ్యాపించియున్నది. యిటువంటి రేఖలు మంచి యోగము ఇందుకు తగ్గట్లు శుభ గుర్తులు మంచిఫలితములను ఇచ్చును.


28

17. ఆయుష్యరేఖపై ఒక నల్లని మచ్చ వుండి ఆమచ్చమీదనుండి ఒకశాఖరేఖ పుట్టి అధోముఖముగ క్రిందకు వ్యాపించి ఉన్నచో- తప్పనిసరి అయిన (అనివార్యమైన) పాండు రోగము, బలహీనత, దుర్బలత్వము కలుగును.

18. ఈ రేఖపై కొంతభాగముమీద అడ్డు రేఖలు వరసగావున్నచో- ఆకాలమంతయు అనారోగ్యముచే బాధపడును.


29

19. ఈ రేఖపై నల్లనిమచ్చలు శరీరపీడ జబ్బుచేయుట సూచించును, మచ్చ మిక్కిలి నల్లనిగను, పెద్దవిగను, బలము గను ఉన్నచో యితరులచే చంపబడు దురు. లేక అకస్మిక ప్రమాదమునకులోనై మరణింతురు.



(ప్రక్కన గల బొమ్మలో వివిధ గుర్తులను పరిశీలించి రేఖలపైనను, హస్తములోను ఎచ్చటెచ్చట వున్నవో తెలుసుకోవలెను ఫలితములను గ్రహించవలెను.

20. ఈ రేఖపై వలయాకారముగ గుండ్రని రేఖలువున్న-అవయసులో దృ[ష్టి] పోయి, అంధుడగును. ఈరేఖ ప్రారంభములో కత్తెరగుర్తు నొక్కువంటి మచ్చలవలన అనారోగ్యమునకు లోనగుదురు. ఈరేఖ చివరిలో కత్తెర గుర్తు వున్నచో అనారోగ్యములకులోనై శక్తి సామర్థ్య ములు వృధాయగును. 30వ బొమ్మను చూసి తెలుసుకోగలరు.



30

21. ఆయుష్యరేఖపై ఎక్కడయినను గోధుమ గింజ లేక లంక గుర్తువం[టి] గుర్తులున్నచో ఆవయస్సులో శరీరపీడ అనగా జబ్బుచేయును. ప్రక్కనగ[ల] 31వ బొమ్మను చూడగలరు.

చేతిలో ఆయుష్యరేఖ ఏవిధమయిన దోషములులేక, విమలముగా లేనిచో - ధనరేఖగానీ, రవిరేఖగానీ, శిరోరేఖగానీ, ఆత్మరేఖగానీ యింకనూ యితర రేఖలు ఎన్నియున్ననూ - ఆరేఖలు అన్నియు నిష్పలమగును. అందుచే అరచేతిలో నుండు రేఖలు అన్నింటిలోను ఆయుష్య రేఖయే ప్రధానమయిన రేఖగా పరిగణింప బడుచున్నది.



31



హస్తములోని ముఖ్యరేఖలు



# ధనరేఖ

శ్లో॥ కరమూలం సమారభ్య ప్రాయుర్వ్యాప్తోర్ధ్వము చిత్రా
మధ్యమానామి కాంసంధిం ప్రాప్తైకాఋజు రేఖకా

ధనరేఖ, కంకణరేఖల పైభాగమునుండి ప్రారంభమే శనిస్థానంమీదకు వ్యాపించి యుండును. ఈ రేఖను భాగ్యరేఖఅనియు అందురు. అరచేతిలో ముఖ్యమైన ఏడు రేఖలలో ఈ ధనరేఖ ప్రధానమైన రేఖగా భావింపబడుచున్నది. ధనరేఖను ప్రక్కన గల బొమ్మలో చూసి తెలుసుకోగలరు.



32

ధనరేఖను పరిశీలించినపుడు అరచేతిలోని స్థానములను తెలిసికొనవలసి యుండును. ధనరేఖ వ్యాపించు విధములు వాటిఫలితములు తెలియగలవు. (క్రింది బొమ్మను పరిశీలించండి)

ధనరేఖ ఆయా మనుష్యులయొక్క భాగ్యమును సంపదను తెలియ జేయును. ఈధనరేఖ పుట్టుక పలువిధములుగా వుండును. ఉదాహరణకు కొందరి హస్తంలలో కంకణరేఖనుండి ప్రారంభమగుచుండును. కొందరి చేతులలో చంద్ర స్థానముమీద నుండియు మరికొందరిచేతులలో కుజస్థానము నుండియు ప్రారంభమై శనిస్థానము వైపునకు వ్యాపించియుండును.



33

ఈ రేఖను బట్టి జీవితములో కలుగు లాభనష్టములు భోగాభాగ్యములు, కలిమిలేములు, ఏవృత్తిచే ధనసంపాదన చేయునది యోగాయోగములు మొదలగు ఆర్థిక విషయములు తెలుసుకొనవచ్చును.

శ్లో॥ అభావే ధనలేఖాయాం ధరణి సహికీర్తతే ।
వ్యయాపి సుమహాన్పాయా ద్దోషజీవన నిర్ణయః॥

చేతిలో ధనరేఖ లేనిచో, ఎదుగుబొదుగులులేని జీవనము కలవాడగున పేరు ప్రతిష్టలులేనివాడును, యితరులపై ఆధారపడి జీవించువాడును. సేవ వృత్తులువలనను. శరీరశ్రమతో కూడుకొనిన కూలిపనులు చేతిపనులు మొ లగు వృత్తులచే కాలముగడుపుచూ సామాన్యమయిన జీవితము కలవారగుదుర

శ్లో॥ సంయుక్త రేఖానురూపం ధనప్రాప్త నిమిత్తకమ్
సర్వదా తాదృశీరేఖా నాస్తియస్య కరాంతరే॥

హస్తములో రెండు ధనరేఖలు వున్నచో గొప్ప అదృష్టవంతులగుదుర రెండు విధములయిన వృత్తులవలన విశేష ధనసంపాదన చేయుచుందుర అట్టి జంట ధనరేఖలలో ఒకటి ఒకస్థానముమీదకును, రెండవది మరియొ స్థానం మీదకును వ్యాపించియున్నచో, ఒకదానిలో మరిఒకటి సంబంధములే వృత్తులవలన ధనసంపాదన చేయుదురు. అనగా ఒకటి వృత్తి ఉదోగ్యములు రెండవది వ్యాపారమును అయివుండవచ్చును.

## ధనరేఖ వ్యాపించు విధములు

ధనరేఖ సాధారణముగ మొదటి కంకణరేఖకు కొంచెము పైభాగము నుండియే ప్రారంభమగుచుండును. ఆవిధముగనున్నచో, చిన్నతనమునుండి సంసార బాధ్యతలు కలుగును.

ఆవిధముగా ధనరేఖ కంకణరేఖ పైభాగమునుండి ప్రారంభమై శనిస్థాన మీదకు వ్యాపించుచుండును. అటుల ఈ రేఖ శని స్థానమీదకు వ్యాపించి యింకయు పైకిపోయి శనివ్రేలు ప్రక్కక్రింద పర్వము మీదకు వ్యాపించి యున్నచో గొప్ప అదృష్ట వంతులగుదురు. స్థిరచిత్తము గలవారుగను, కార్యాచరణలో స్వతంత్రముగ వ్యవహరించువారుగను ఉందురు. ఈ ప్రక్కనగల 34వ బొమ్మను చూసి తెలుసు కోగలరు. యీరేఖ విమలముగా అడ్డురేఖలు లేక స్పష్టముగా వున్నచో మంచి అదృష్టవంతు డగును.


34



కొందరి హస్తములలో ధనరేఖ యుష్యరేఖపై పుట్టి పైకి వ్యాపించు ండును. అవిధముగా నున్నచో ఆవ్యక్తి శక్తివలననూ, స్వయంకృషివలననూ తన థాశక్తి వలననూ మంచి అభివృద్ధిని ంచగలుగును ధనరేఖ ఆయుష్యరేఖ పై రంభమయినపుడు చేతిలో-గురు, శుక్ర, రవి,చంద్ర స్థానములు లముగను ఉచ్ఛగను - అనగా - ఎత్తుగను ఉన్నచో గొప్ప ప్రతిభ గలవారై నసంపాదనయేగాక, దేశవ్యాప్తమయిన కీర్తినిగూడా పొందగలుగుదురు. యుష్యరేఖపై పుట్టి శనిస్థానము పైకి వ్యాపించిన విధము 35వ బొమ్మను చి తెలుసుకొన గలరు.


35

ధనరేఖ శుక్రస్థానంమీద నుండి ప్రారంభమయినచో కళత్రమూలము అనగా త్తవారివలన ధన,భూ,గృహములు బాగుగా భించును. గొప్పయింటి ల్లరికము వెళ్ళు రి హస్తములలో ఈధనరేఖ సాధారణముగ శుక్రస్థానము మీదనుండి ప్రారంభమగు ండును. 36వ బొమ్మను చూడండి.


36

ఇది చంద్రస్థానముమీద ప్రారంభమై శనిస్థానం మీదకు వ్యాపించియున్న యెడల ప్రజల సహాయము వలనను ప్రజాభిమానము వలనను గొప్ప అభివృద్ధి లోనికివచ్చును. మరియు ప్రజాభిప్రాయము ప్రజాదరణకు సంబంధించిన సంగీతకళ, నాట్యకళ, కవిత్వము, జోతిష్యము, చేతిపరిశ్రమలు మొదలగు వాటివలన మంచి అభివృద్ధిలోనికి రాగలుగుదురు. ఇట్టి ధనరేఖ గలవారు. కొందరు అత్తవారి సహాయమువలన అభివృద్ధిలోనికి వచ్చుచుండుట మనము చూచుచున్నాము. ప్రక్కనగల 37వ బొమ్మనుచూసి పరిశీలించి తెలుసుకోగలరు. యిది గొప్ప అదృష్టయోగము.


37

ధనరేఖ చంద్రస్థానము మీద ప్రారంభమయి శనివ్రేలు క్రిందను: పర్వాతరేఖమీదకు వ్యాపించినచో అగర్భశ్రీమంతుడై జీవితకాలమంతయా సకలభోగభాగ్యములలో తులతూగుచుండును. గొప్ప యోగజాతకము 38వ బొమ్మను చూడండి.

ధనరేఖ, శిరోరేఖకు కొంచెము క్రిందలో ప్రారంభమై శనిస్థానముమీదకు వ్యాపించియున్న యెడల సుమారు ముప్పయి సంవత్సరముల వయస్సు వచ్చు వరకూ సామాన్యస్థితిలో ఉండి కొంచెము గడిపి, ఆ తరువాత స్వశక్తి వలననూ, స్వయంకృషివలననూ మంచి అభివృద్ధిలోనికి వచ్చుట జరుగును. ధనరేఖ ఈ విధంగ నున్నచో వీరు తమ పిత్రార్జితమును చిన్నతనమునే పోగొట్టు కొను వారగుదురు.



38

39వ బొమ్మను చూసి తెలిసికో గలరు. భావము తెలియగలరు. యీ రేఖను చూచునపుడు జాగ్రత్తగా తదితర అడ్డురేఖలను పరిశీలించవలెను. ధనరేఖ అరచేతి మధ్యములో శిరోరేఖ క్రింద నుండి ప్రారంభమై శనివ్రేలు క్రింద పర్వతము మీదకు వ్యాపించియున్నచో దరిద్రు డగును. తన అభివృద్ధికై చేయు ప్రయత్నములు ఫలించక విదల మనో రథుడై కష్టములతో కాలము గడుపు చుండును. అటువంటి ఫలితములకు రేఖ విస్పష్టముగా వుండక, మందముగా వుండును.



39



ధనరేఖ చేతిలో చాలాక్రింది గములో పుట్టి ధనరేఖనుంచి పుట్టిన క్రరేఖ శుక్రస్థానము మీద కుగాని ంద్రస్థానము మీదకుగాని వ్యాపించి యున్నచో అట్టి వ్యక్తి దత్తత వెళ్ళుటయు, ట్టి దత్తతవలన విశేషముగ ధన, భూ, గృహములు లభించుటయు జరుగును. 40వ బొమ్మను చూసి తెలిసికొనగలరు.



40

ధనరేఖ-శిరోరేఖ మీదనుండి ప్రారంభమై, శనిస్థానముమీదకు వ్యాపించి యున్న ముప్పదియైదు సంవత్సరములు వయస్సు వచ్చువరకు సామాన్య జీవితమును గడిపి, తరువాత స్వయం కృషిచే విశేష ధనసంపాదన చేయగల వారగుదురు. 41వ బొమ్మను చూడండి.



41

ధనరేఖ శిరోరేఖవరకు వ్యాపించి శిరోరేఖను తాకుతూ ఆగిపోయిన యెడల అట్టివారు తమ తెలివితక్కువ తనము వలనను. తమ చేతులారానూ ధనమును పాడుచేసుకొని. పతనము జెంది. దరిద్రా వస్థలో పడుదురు. పై వివరములకు ప్రక్కన గల 42వ బొమ్మను చూసి గ్రహించగలరు.



42

ధనరేఖ చంద్రస్థానముమీద పుట్టి గురుస్థానము మీదకు వ్యాపించి యున్నచో అదృష్టవంతుడగును. విశేష ధనసంపాదన కలవాడగును. అనుకూల వతియైన భార్యకూడా లభించి దాంపత్య



43

జీవితము సుఖముగా ఉండును. 43వ బొమ్మను చూడగలరు. ధ
బుధస్థానముమీదకు బాగుగా వ్యాపించి యున్న పలువిధముల వ్యాపారమ
చేసి విశేష ధనసంపాదన చేయును.

ధనరేఖ చివరిభాగములో రెండు మూడు శాఖలుగా ఉండి, అందొకశాఖ రవిస్థానము మీదకు, యింకొక శాఖ గురుస్థానము మీదకు, మూడవశాఖ శనిస్థానం మీదకు వ్యాపించియున్నచో ఆ మూడు రేఖలుగా చీలియున్నచోట, అనగా ఆ వయస్సులో అకస్మిక ధన లాభము అనగా లాటరీ మూలమున ధనలాభము కలుగును. అదిలగాయతు


44

అవ్యక్తి అష్ట ఐశ్వర్యములతో తులతూగుచుండును. పైవివరములు
బొమ్మను చూసి తెలుసుకోవలెను. యిది గొప్పయోగము.

ధనరేఖ చివర రెండు మూడు శాఖలుగాచీలి, ఒక్కొక్కశాఖ ఒక్కొ
స్థానముమీదకు వ్యాపించియున్నచో రెండు మూడు వృత్తులవలన ధనస
దన గలవాడును, సంఘజీవితములో విశేషమైన కీర్తి నార్జించువాడును రాజకీ
నాయకుడును అగును. గొప్ప అభివృద్ధిని సులభముగా సాధించగలుగు
ధనరేఖనుండి బయలుదేరిన ఊర్ధ్వశాఖ రేఖలు ఊర్ధ్వముఖముగ వ్యాపి
యున్నచో ఆయా వయస్సులలో మంచి అభివృద్ధి కలుగుటను సూచిం
అట్టి శాఖ ఒకటి రవిస్థానముమీదకు వ్యాపించియున్నచో విద్యాభివృ
ఆకాలములో ఉద్యోగాభివృద్ధిని ఐశ్వర్యమును కలుగజేయును.

అరచేతిలోరేఖలు అధికముగ యుండి అడ్డదిడ్డములు వ్యాపించియున్నచో జీవిత మంతయు, కష్టములతో నిండి యుండి, కుటుంబ బాధ్యతలు అధికముగ యుండి బాధలు పడుచుండును. ఇందుకు ప్రక్కన గల45వ బొమ్మను పరిశీలించూచిన భావం అర్థమగును.


45



ధనరేఖ ఆత్మరేఖవరకు వ్యాపించి ఆత్మ రేఖను తాకి అక్కడ ఆగిపోయినచో భార్య మూలమునగానీ, అన్యస్త్రీ మూలమున గానీ దరిద్రావస్థను పొందు వారగుదురు. జీవితము బహుదుర్భరముగా నడుపగలరు. వివరము లకు ప్రక్కన గల 46వ బొమ్మను చూడండి.


46

ధనరేఖ,ఆత్మరేఖ మీద నుంచి ప్రారంభ మగుచున్న యెడల, వృద్ధాప్యములో మంచి ధనదాయము కలుగును. అట్టి ఆదాయము అన్యస్త్రీ సహాయ మువలన కలిగి, ఆర్థికముగా మంచి స్థితిలోనికి రాగలుగుదురు. ప్రక్కనగల 47వ బొమ్మను జూడగలరు. ధనరేఖ, ఊర్ధ్వ రేఖకు సంబంధించిన రేఖయగు చున్నది. చేతి యందుండు ఊర్ధ్వశాఖలలో ధనరేఖయు, రవి రేఖయు, ప్రధానములయినవిగ తెలియ వలయును.


47

శ్లో॥ ఊర్ధ్వరేఖాయుత శ్రీమాన్ తిర్యరేఖా దరిద్రవాన్ ।
బహురేఖా ప్రవాసశ్చ అష్టకష్టాః ప్రకీర్తితాః॥

అరచేతిలో ఊర్ధ్వముఖముగ వ్యాపించియుండు. రేఖలన్నియు అదృ ష్టమును సూచించును. అధోముఖంగా, అనగా పైనుండి క్రిందకు వ్యాపించి యుండు రేఖలు అడ్డదిడ్డములైన బహురేఖలు-కలుగబోవు అష్టకష్టములనూ, దరిద్రమునూ సూచించును.

రేఖపుట్టినచోట, అనగా ప్రారంభమయిన ప్రదేశము వెడల్పుగాయుండి, పైకిపోను సన్నముగచూ పైభాగానసూది మొనవలె సన్నముగయుండు రేఖ ఊర్ధ్వ రేఖ అనబడును. రేఖ పైభాగమున వెడల్పుగాయుండి, క్రిందకు వ్యాపించిన కొలదియూ సన్నమగును. క్రింద చివరభాగమున దారమువలెను. సూదిమొన వలెను మిక్కిలి సన్నమగను యుండు రేఖ అధోరేఖ అనబడును. చేతిలోని ఊర్ధ్వరేఖలు అభివృద్ధిని అధోరేఖలు దరిద్రమును, కష్టములను, పతనమును సూచించును.

శుక్రస్థానము మొదనుంచి ఒకరేఖ ప్రారంభమై ధనరేఖవైపు వ్యాపిం ధనరేఖలో కలిసినయెడల ఆవ్యక్తి అమితకామేచ్ఛ గలవాడై తిరుగుచు, శృం జీవితమును గడుపును. శుక్రస్థానము నుంచివచ్చిన రేఖ ధనరేఖ ఖండించుచూ రెండవ ప్రక్కకు పోయినచో, తాముప్రేమించిన స్త్రీమూలమ చివరకు కష్టములు నష్టముల పాలగుదురు.

అదృష్టరేఖపై నక్షత్రములు ధన నష్టములను సూచించును. ధన, ఆయు ష్యరేఖలమీద అక్కడక్కడ అడ్డముగ సూక్ష్మరేఖలు వ్యాపించి యున్నచో ఆయా కాలములలో కుటుంబ చిక్కులను, ధన నష్టమును కష్టములను సూచించును. 48వ బొమ్మను చూడండి. చంద్రస్థానము మీద ఒక నక్షత్రము గుర్తువుంది ధనరేఖ చివర అనగా శనిస్థానముమీద ఒక నక్షత్రము న్నచో అట్టివారు ఆత్మహత్య చేసుకొని మరణించుదురు.



48

ధనరేఖమీద లంక, వడ్ల గింజవంటి గుర్తులున్నచో ఆ వయస్సులో ఉద్యోగ భంగమును - ధననష్టమును కలిగి అనేకములైన అర్థిక చిక్కులతో బాధపడు దురు 49వ బొమ్మను చూడండి.



49

చంద్రస్థానముమీద ఒకరేఖపుట్టి ఆ రేఖవచ్చి ధనరేఖను తాకినచో ఆ కాలములో వివాహము జరుగును. వివాహరేఖపై ఒకరేఖపుట్టి ఆ రేఖ బు స్థానముమీదకు వ్యాపించియున్నచో, వివాహమువలన ధనప్రాప్తియు జీవితములో మంచి అభివృద్ధి భోగభాగ్యములు కలుగును. దీనికితోడు గురు స్థానముమీద ఒక నక్షత్రముకూడా వున్నచో కళత్రమూలమున విశేష ధ లాభమును, గొప్ప అదృష్టమును కలుగును.



ధనరేఖమీద ఒక రేఖపుట్టి, అది మొదటి కుజస్థానముమీద వ్యాపించి యున్నచో ఆకాలములో స్త్రీమూలకమున విశేష ధన లాభము కలుగును అఖండ ఐశ్వర్యములును కల్గును. ప్రక్కన గల 50వ బొమ్మను పరిశీలించి చూడగలరు.



50

ధనరేఖ ఎక్కడయినను తెగియుండి మధ్యలో ఖాళీయేర్పడి యున్నచో, లేదా అక్కడక్కడ తెగియుండి మధ్యమధ్య ఖాళీ ఏర్పడినచో ఆయా వయస్సు లలో ధననష్టము కలిగి ధరిద్రావస్థ యేర్పడును. లేదా, చేయుచున్న ఉద్యోగమునకు భంగము కలిగి జీవితములో విశేష మయిన మార్పులు కలుగును. అది లగాయితూ పూర్వపు జీవితమునకు భంగంకలిగి మార్పులు యేర్పడును. ప్రక్కనగల 51వ బొమ్మను చూడండి. ధనరేఖ ఖండ ఖండములుగ ఉండి అతికియున్న ముక్కలు ముక్కలు వలె గాన్పించుచున్నచో, ఆవ్యక్తి యొక్క జీవితము ఏ వృత్తి యుందును. స్థిరముగ ఉండక స్థిరమైన జీవితము లేక ఒకప్పుడు బాగుగా యుండి మరియొక్కప్పుడు కష్టములతో ఉండును.



51

ధనరేఖ చివరి శనిస్థానము మీద కత్తెర గుర్తు, ఆకస్మికముగ కలుగు ప్రమాదమువలన అకాలమరణమును సూచించును. ధనరేఖ తిన్నగా రవిస్థానము మీదకు వ్యాపించియున్న గొప్ప రాజకీయ వేత్తయగును, లేదా ఒక శాస్త్రములోగాని, ఒక కళలోకాని మహానిపుణుడు అగును. మేధావి అగును. ప్రక్కనగల 52వ బొమ్మను చూడగలరు.



52

ధనరేఖ పూర్తిగా బుధస్థానము మీదకు వ్యాపించి యున్నచో, వ్యాపారము చేసి విశేష ధన సంపాదన చేయువాడయు, గొప్ప ఐశ్వర్యములు సంపాదించును. ప్రక్కనగల 53వ బొమ్మను చూడండి. అరచేతిలో ధనరేఖ యుండుట గొప్పయోగము, అదియునూ, బహుసన్నముగా యుండి, విశాలముగను, కాంతివంతముగను అడ్డు రేఖలు లేకుండగను యుండవలయును.


53

### ఆకస్మిక ధనలాభము - లాటరీ యోగములు

చూపుడువ్రేలు, అనగా, గురు వ్రేలు ఆఖరిపర్వముమీద "నక్షత్రము" ఉన్నను, మొదటి కంకణరేఖపై "కత్తెర"గుర్తు ఉన్నను, ఆకస్మికముగ గానీ లాటరీ మూలముగగానీ ధన లాభము కలుగును. 54వ బొమ్మను చూడండి.


54

గురుస్థానముమీద నక్షత్రము గుర్తు ఉన్ననూ, ధనరేఖకు దగ్గరగా శిరోరేఖ మీద తెల్లనిమచ్చలు ఉన్ననూ, ఆకస్మిక ధనలాభము కలుగును. అరచేతిలో గల రేఖలపై గల కొన్ని గుర్తులు వివరణలు:-

1. మచ్చలు
2. ద్వీపమువలెయుండు లంకగుర్తులు
3. చతురము
4. నక్షత్రములు
5. కత్తెర
6. వలయము
7. త్రిభుజము
8. జల్లెడ
9. కుచ్చు రేఖలు
10. పంగలకర్ర వలెయుండు శాఖరేఖలు
11. త్రిశూలము
12. చంద్రవంక
13. నిచ్చెనరేఖలు
14. వర్ణరేఖ, లేకకొబ్బరాకులో ఈనెవలెనుండు రేఖలు





ఈ విధముగా సుమారు నూట అరవైకి పైగా సూక్ష్మరేఖల గుర్తులు వున్నాయని తెలుస్తోంది. ఒక్కొక్క గుర్తునుబట్టి, ఆ గుర్తువుండే రేఖను బట్టి ఆయా స్థానము లను బట్టి వాటిఫలితములు తెలిసికొనవలసియున్నది.

ఈ గుర్తులన్నిటిలో చతురము అనుగుర్తు-చాలా శుభకరమయినది. ఇది ఎక్కడ వుండునో-అనగా ఏ స్థానంమీద వుండునో, లేక, ఏ రేఖమీదవుండునో ఆ వయస్సులో గలుగు ప్రమాదములను తప్పించి కాపాడుచుండును. ఉదాహరణకు-ఆయుష్యరేఖ వయస్సు ముప్పైసంవత్సరకాలములో రెండు ఖండములుగా తెగియున్నదనుకొనుడు అవిధముగా ఆయుష్యరేఖపై తెగియున్న, అది ప్రాణభయమును సూచించును. అట్టిచోట యీ చతురమువున్నచో జబ్బుచేసి నిమ్మళించును. చతురముగుర్తు ప్రాణాపాయమునుండి కాపాడును. ఈరేఖను మనపూర్వులు "సంజీవి"రేఖగా చెప్పియున్నారు. అరచేయిలో రేఖలపై ఈ చతురము వున్నప్పుడు తప్పనిసరిగా ఒక ఫలితమును యిచ్చునుగాన, తొందరపడి ఫలితములను నిర్ణయించకూడదు యిది ఒక అదృష్టము.

ఈ విధముగా ధనరేఖలో కూడా వివిధగుర్తులు వాటి ఫలితలను తెలిసికోగలరు. విదానించి భావం గ్రహించవలెను. రవిరేఖ, ధనరేఖ మీద పుట్టి సూర్యస్థానముమీదకు వ్యాపించియున్నను లాటరీమూలముగా ధనలాభము కలుగును.

బుధస్థానముమీద ఒకరేఖ పుట్టి చిటికెనవ్రేలి మూడవపర్వముమీదకు రెండుకానీ, మూడుకానీ, సమానాంతర రేఖలు వ్యాపించియున్నచో వారసత్వము రీత్యా ఆస్తి లభించును. పైరెండు ఫలితములను 55వ బొమ్మను పరిశీలించి తెలిసికోగలరు. మరియొక కంకణ రేఖపై కత్తెరయును, త్రిభుజమును, నక్షత్రము వంటి గుర్తులున్ననూ వారసత్వము వలన ఆస్తి లభించును. ఆకస్మిక ధనలాభము యోగము కలుగును.


55

గురుస్థానంమీద కత్తెర, నక్షత్రం వంటి గుర్తులున్నచో, భార్యమూలమునగానీ, వారసత్వమువలనగానీ ఆస్తిలభించును. అరచేతియందు ధనరేఖ యుండి రవిస్థానము మీద నక్షత్రము వున్నచో ఉద్యోగ మూలమున గానీ, ప్రభుత్వములో వున్నత పదవులవలనగానీ, విశేష ఆస్తిని సంపాదించ గలుగుదురు. వివరములకు 56వ బొమ్మను పరిశీలించి తెలిసికోగలరు.


56

రవిస్థానముమీద నక్షత్రమువుండి, అచటి నుండి ఒకటి రెండు ఊర్ధ్వ రేఖలు పుట్టి వ్యాపించిన ఆకస్మిక ధనయోగము, రెండు శిరోరేఖలు, ఒకదాని ప్రక్క మరియొకటి సమానదూరములో అరచేతిలో అడ్డముగా వ్యాపించి యున్నచో గొప్ప మేధాశక్తిగలవారులు, ప్రపంచ వ్యాప్తమయిన కీర్తి సంపాదించువారులు' స్వశక్తిచే విశేష ధనసంపాదన చేయగలవారును, నోబుల్ బహుమానములు-పద్మశ్రీ మొదలగు బిరుదులు పొందువారును అగుదురు. 57వ బొమ్మను పరిశీలించి చూడండి.


57

అయుష్యరేఖమీదగాని శిరోరేఖమీదగానీ పుట్టిన ఊర్ధ్వ ముఖముగ వ్యాపించుచూ, రవిస్థానముమీదకుగానీ గురుస్థానముమీదకుగానీ, వ్యాపించి యున్నచో, స్వశక్తిచే విశేష ధనసంపాదన చేయువాదును వేలకువేలు లక్షలు అర్జించువారును అగుదురు. ఇట్టి రేఖ అదృష్టవంతులైన కొందరు గవర్నమెంటు ఆఫీసర్ల చేతులలో కూడా కనబడుచున్నది. ధనరేఖమీద చతురము త్రిభుజమువంటి గుర్తులు గృహనిర్మాణ యోగమును సూచించును. ఆరేఖలో గుర్తును బట్టి వయస్సును లెక్కించి తెలుసుకోగలరు. ప్రక్కన 58వ బొమ్మను చూడండి.


58



శిరోరేఖమీద ఒకశాఖ రేఖపుట్టి అదిగురు స్థానము మీదకు వ్యాపించి ఆ శాఖ రేఖ చివర నక్షత్రమున్నచో వయస్సు సుమారు ముప్పదియైదవ సంవత్సరములో ఆకస్మిక విశేష ధన లాభము గొప్ప ఐశ్వర్యము- కీర్తి అతిచిన్న వయస్సులోనే మహాయోగమును కలుగును. 59వ బొమ్మను చూడండి.


59

రవిరేఖ అరచేయి మధ్యభాగములో పుట్టి రవిస్థానముమీదకు వ్యాపించి యున్నను, లేదా ధనరేఖ అదేవిధముగ అరచేయి మధ్యలోపుట్టి, శనిస్థానము మీదకు వ్యాపించియున్నను, వయస్సు నలభై సంవత్సరముల వరకు సామాన్య జీవితముగడిపి, నలభై నుండి స్వశక్తిచే విశేష ధనసంపాదన కలిగి సకలసంపదలు కరవారగుదురు. గొప్ప ఐశ్వర్యమును కీర్తిని సంపాదించ గలుగుదురు. ప్రక్కన గల 60వ బొమ్మను చూడండి.


60

రవిస్థానము నీచముగా యున్నను అనగా, చుట్టబడినట్లున్నచు. రవిరేఖ స్పష్టముగను, దృఢముగనూ, ఉండక వెలవెల పాలిపోయినట్లున్ననూ, రవి స్థానముపై జల్లెడ రేఖలున్నను దరిద్రముచే బాధపడుచుండు వారగును. లేదా కొంతకాలము ధనవంతులుగయుండి దురదృష్టవశాత్తు ఆస్తియంతయుపోయి దరిద్రావస్థను పొందువారగుదురు.


61

ఆయుష్యరేఖపై త్రిభుజము-గుర్తువున్నచో లాటరీ మూలముగ ధన లాభము కలుగును. లేక ఆకస్మికముగ విశేష ధనలాభంకలుగును. పైనగల 61వ బొమ్మను పరిశీలించండి.

మధ్యవ్రేలుపైన పూర్ణాచంద్రాకారముగ వలయము వంటి రేఖగానీ, పద్మం వంటి రేఖగానీయున్నచో లాటరీ కలుగును, యీవిధముగా అరచేతి యందు ధనరేఖ శనిస్థానము వరకువుండి శనివ్రేలుపై వలయము (సున్న) వంటి గుర్తు వున్నచో లాటరీ మూలమున విశేష ధనలాభముగును 62వ బొమ్మను చూడండి.



62

చేతిలో ధనరేఖ, కంకణరేఖల నుండి శనిస్థానము వరకూ వ్యాపించక, మరి యొక రేఖ, ధనరేఖకు ప్రక్కగా చంద్రస్థానమునుండి ఊర్ధ్వ ముఖముగా శని స్థానము క్రిందవరకు వ్యాపించును. వీటిని రెండు ధనరేఖ లందురు. వీటి మూలముగా ఆకస్మిక ధనలాభముగానీ లాటరీమూలముగా ధనలాభముగానీ, కలుగును. గొప్ప ఐశ్వర్య"వంతులు అగుదురు. వీరికి జీవితములో ఉన్నతములైన యోగములు కల్గును. 63వ బొమ్మను చూడండి.



63

ధనరేఖ-కంకణరేఖపై అట్టి మధ్యవ్రేలు అనగా శనివ్రేలు ఆఖరి పర్వము మీదకు వ్యాపించి యున్నచో జీవిత కాలమంతయూ, భోగభాగ్యములు, లాటరీ మూలమున ధనలాభము కలుగున్ను. లేదా ఆకస్మిక ధనలాభం కల్గును. 65వ బొమ్మ చూడండి.



64



# ఆత్మరేఖ

ఆత్మరేఖ భాగములను తెలుపును దీనినే హృదయరేఖ అనికూడా అందురు. అరచేతిలో యీ రేఖ ప్రధానమయిన రేఖగా తెలిసికొన వలయును. ఈ రేఖ చిటికెనవ్రేలు క్రిందయుండు బుధస్థానం క్రింద ప్రారంభమై, బుధ,రవి,శని స్థానముల క్రిందుగా అరచేతిలో అడ్డముగా వ్యాపించి శని స్థానము క్రిందగాని గురు, శని స్థానముల మధ్య గాని, గురుస్థానము మీదగానీ ఆ సమీపమునగానీ, అంత్య మగుచుండును. ఈరేఖ ప్రేమ కామ స్వభావమును భోగముల యందాసక్తిని వాటిని సంబంధించిన విషయములను సూచిం చిన విషయములను సూచించును. 65వ బొమ్మను పరిశీలించండి.




65

శ్లో॥ కనిష్ఠాంగులీదేశాత్తు రేఖాగచ్ఛతి మధ్యమాం
అవిచ్ఛిన్నాతు రేఖా స్యాదశీత్యాయుర్వినిర్దిశేత్ ॥
అని చెప్పబడియున్నది.

అట్టి యీరేఖ స్పష్టముగను, విమలముగాను, కాంతియుక్తముగను ధృడముగను వ్యాపించియున్నచో జీవితకాలములో భోగములు కలుగును. దాంపత్యజీవితం సుఖప్రదముగ వుండును. స్త్రీ సౌఖ్యము కలుగును. అట్టి జీవితములో ఏవిధమలయిన కష్టములు, భంగములు, భగ్నప్రేమలు, నిరాశలు గలుగవు. జీవితకాలమంతయు సుఖప్రదముగ వుండును. ఈ ఆత్మరేఖను బట్టి-వారి హృదయమును, అనురాగమును ప్రేమయును వ్యక్తమగుచుండును.

మన పూర్వులు ఈరేఖను ఆయుర్దాయ రేఖగా కూడా చెప్పి యున్నారు. మరియు ఈరేఖ గురు స్థానముమీదనుంచిగాని ఆసమీపము నుంచి గాని

ప్రారంభమై చిటికెనవ్రేలు క్రింద అంత్యమగు చుండునని తెలిపి యున్నారు.


66

అరచేతిలోని స్థానముల వివరంబు తెలుసుకొనినచో ఆత్మరేఖ వ్యాపించు విధానములు - వాటి ఫలితములు తెలియ గలవు. ప్రక్కన అరచేతిలోని స్థానముల బొమ్మను చూడగలరు.

కొందరి హస్తములలో ఆత్మరేఖ శిరోరేఖలు రెండూ పైన వేసుకొని రెండవ కుజస్థానము మీద ప్రారంభమై అనగా, గురుస్థానము క్రింద ప్రారంభమై చేతిలో అడ్డముగా వ్యాపించి అరచేతిలో చివర బుధస్థానం క్రింద అంత్యమగు చుండును. అట్టి వ్యక్తులు హృదయము లేనివారై, లోభులుగ వుందురు. కఠిన మయిన మనస్సుగలవారుగా వుందురు. భార్య చెప్పు చేతలలోనే వుందురు. అనగా, యింటి పెత్తనము భార్యదైర్యయుండును. భార్యక్రింద సేవకునివలె పని చేయుదురు. 67వ బొమ్మను పరిశీలించి తెలిసికొనగలరు.


67

ఈ రేఖ మధ్యలో ఎక్కడైనను తెగియున్న ఆకాలములో అనగా ఆ వయస్సులో భార్య మరణించును. 68వ బొమ్మను చూడండి. ఇక్కడగల ఖాళీని తెగిన రేఖగా భావించవలెను. ఈ రేఖ యొక్క క్రిందభాగమునుండి ఒక రేఖపుట్టి ఏట వాలుగా ప్రారంభమయి, శిరోరేఖమీదకు


68



వ్యాపించియున్నచో ఆవయస్సులో భార్యకు జబ్బు చేయును. లేదా తాను ప్రేమించిన స్త్రీతో ఎడబాటు కలుగును. తద్వారా మనోదౌర్బల్యము కలుగును.

ఆత్మరేఖ పొడవుగయుండి గురుస్థానము మీదకు వ్యాపించి వున్న దయార్ద్ర హృదయుడును పరోపకారబుద్ధి కాలవాడును. త్యాగియును ప్రజలకు ఉపకారం చేయు చుండువాడును అయి కీర్తిని పొందువాడగును. 69వ బొమ్మను చూడండి.


69

ఈరేఖ గొలుసువలెయున్నచో దాంపత్య జీవితము చిక్కులతో కూడుకొని వుండును. మరియు అరచేతిలో ఈ ఆత్మరేఖ లేనివారు, బాల్యమునందే, మరణించుదురని చెప్పుదురు. ఆత్మరేఖ, శిరోరేఖ, ఆయుష్య రేఖ- ఈ మూడును ప్రారంభంలో కలిసి యున్నచో ఆకస్మిక మరణము కలుగును. అకాలమును- ఆయుష్యరేఖ నాయారేఖలు కలిసిన వయస్సును బట్టి తెలుసుకొన వలయును. పై వివరములను ప్రక్కనగల 70వ బొమ్మను చూచి పరిశీలించగలరు. భావము గ్రహించ గలరు.


70

ఆత్మరేఖకు ప్రక్కనే మరియొక రేఖ నమానాంతరముగ, ఆత్మరేఖ ఎంత పొడవుపుండునో, అంత పొడవునా వ్యాపించి యున్నచో, యిద్దరు భార్య లుందురు. 71వ బొమ్మను చూడండి ఈరేఖపై సూర్య స్థానము క్రింద గుండ్రంగ వృత్తమువలె ఒకరేఖ యున్నచో నేత్రరోగములు కలుగును.


71

ఆత్మరేఖ ప్రారంభములో చిన్నచిన్న పాయలువలెయున్నచో అవి ఎన్ని యుండునో, అంతమంది భార్యలు వుందురని చెప్పుచుందురు. ప్రక్కనగల 72వ బొమ్మను చూడగలరు.


72

ప్రారంభములో చిన్నచిన్న ఉపరేఖలు లేనిచో సంతానము గలుగదనియు చెప్పుచుందురు. ఆత్మరేఖలో పుట్టినశాఖ యొకటి క్రిందకు వ్యాపించి అదృష్ట రేఖను తాకుచున్నది. ఆ వయస్సులో వైధవ్యము వచ్చునని చెప్పుచుందురు.

ఆత్మశిరో, ఆయుష్యరేఖలు మూడునూ ప్రారంభములో కలిసియు న్నపుడు గురుస్థానముమీదకు వ్యాపించి యున్న ఆత్మరేఖ యొక్క శాఖ యింకొక రేఖచే ఖడింపబడు కత్తెర వలెయున్నచో భార్యనువదలి మరియొక స్త్రీతో సాంగత్యం పెట్టుకుని కష్టములకు లోనగును. తద్వారా మానసికముగా దుర్బలత్వము చెందుదురు.

అశాంతికి లోనగుదురు. ఈ రేఖ బుధస్థానము క్రింద తెగియున్నచో వ్యాపారములో విశేష ధననష్టము 73వ బొమ్మను పరిశీలించి తెలుసుకొనవలెను. రేఖపై కత్తెరలు-స్త్రీ సంబంధ విషయము లలో చిక్కులు కష్టములు, ఎడబాటులు కలుగును. ఆత్మధైర్యము తగ్గగా, ఎనలేని కష్టనష్టములకు గురి అగుదురు.


73



ఆత్మరేఖ గురుస్థానము మీదకు వ్యాపించి, చివరిభాగములో అదృష్ట ఖలోగాని ఆయుష్యరేఖతోగాని కలిసి, ంకను కొంతదూరము వ్యాపించి యున్నచో గొప్ప అదృష్టవంతుడగును. 74వ బొమ్మను చూసి తెలిసికోగలరు. ప్పయోగము.


74

ఈరేఖపై తెల్లని మచ్చలవలన సౌఖ్యము, స్త్రీ మూలమున ధన లాభము లుగును. గొప్పగా యోగించును. ఆత్మరేఖనుండి పుట్టిన ఒకశాఖరేఖ చంద్ర స్థానంమీద వ్యాపించి ఆ చివర క్షత్రమువున్నచో ఉన్మత్తుడు, పిచ్చివాడు గును. 75వ బొమ్మను పరిశీలించగలరు.


75

ఆత్మరేఖ తెలుగు సాముద్రిక శాస్త్రగ్రంథములలో బుధస్థానం క్రిందపుట్టి గురుస్థానం మీదకు వ్యాపించి యుండునని చెప్పబడి యున్నది. ఇంగ్లీషు సాముద్రిక గ్రంథము లలో గురుస్థానము క్రిందపుట్టి బుధ స్థానము క్రిందకు అరచేతి చివరకూ వ్యాపించియుండునని చెప్పబడి యున్నది.

ఈ రేఖ గురుస్థానమునకు సమీపములో సంగలకర్రవలె రెండు రేఖలు చీలియుండి, ఒకరేఖ గురు స్థానం మీదకును, రెండవశాఖ గురు, శనివ్రేళ్ళుకు మధ్యకును, వ్యాపించి యున్నచో స్త్రీ మూలమున భోగ భాగ్యములు కలుగును. ప్రక్కన గల 76వ బొమ్మను చూసి తెలిసికోగలరు.


76

ఈరేఖ కళాహీనముగ యుండి, లోతులేనిదిగను, వెడల్పుగను, న
యున్నచో దాంపత్యజీవితము బాగుగా యుండదు. తద్వారా మానసిక
లోనగుదురు.

ఆత్మరేఖపై, రవిస్థానము క్రింద ఒకరేఖ పుట్టి రవివ్రేలు క్రిందవరకు వ్యాపించి యున్నచో, ఏదో ఒక శాస్త్రములో పండితుడగును. అట్టిరేఖలు రెండు వున్నచో విశేషప్రజ్ఞ కలిగి విశేషమైన కీర్తిని, ధనమును పొందురు. ప్రక్కన గల 77వ బొమ్మను చూసి తెలుసుకోగలరు.


77

ఆత్మరేఖ-దాంపత్యజీవితమునకు సంబంధించిన విషయములను అన్య స్త్రీలతో ఉండు సంబంధ మూలమున కలుగు ధననష్టము-కష్టములను, ప్ర
సంబంధించిన విషయములను సూచించును. అనేక హస్తములు చూచి,
అనుభవజ్ఞానమును సంపాదించియు అనేక సాముద్రిక గ్రంథములు చదివి
ఫలితము చెప్పవలెను. ప్రధానరేఖలలో యీ ఆత్మరేఖ ముఖ్యమైనది. ఈరే
పూర్తి అవగాహనతో పరిశీలించి ఫలితములు నిర్ణయించవలెను.

అరచేయి, రేఖలు స్థానములపైనా, ఉండు కొన్ని గుర్తులు.







# శిరోరేఖ

శిరోరేఖ మేధాశక్తిని సూచించును. దీనిని చాలా ముఖ్యమయిన రేఖగా ప్పవలెను. ఈరేఖను మన ప్రాచీన గ్రంధములు సీమంతరేఖ యని చెప్పి యుండెను. ఈరేఖను బుద్ధిరేఖ లేక, శీర్షరేఖ అనికూడా అందురు. యిది ఓ సాధారణరేఖ.

ఈరేఖ సాధారణముగ చూపుడు వ్రేలు, టనవ్రేలు మధ్య ప్రారంభమై అరచేతిలో డ్డముగా వ్యాపించి, అరచేతి అంచువరకు ్యాపించి మొదటి కుజస్థానం, లేదా చంద్రస్థానము రదకు వంపు తిరిగి అంత్యమగు చుండును. క్కనగల 78వ బొమ్మను చూసి శిరోరేఖ లుసుకోగలరు.


78

ఈ రేఖనుబట్టి మేధాశక్తిని, విద్యాభావ మును ూడా చెప్పవచ్చును. ఈ రేఖ చల్లగను, మిక్కిలి డల్పుగను ఉండక-స్పష్టముగను కాంతివంతము ను ఉండి అరచేతి అంచువరకు వ్యాపించి యున్నచో గొప్ప మేధావియగును, మరియు ద్యావంతులై డిగ్రీలు సంపాదించువారగుదురు. ద్ద చదువులతో, స్కాలర్‌షిప్పులు-మెడల్స్ యిత్యాదిగా కీర్తి గౌరవములు ొందగలరు.

అరచేతిలో స్థానములు వివరములు తెలిసుకొనిన శిరోరేఖ వ్యాపించి అంత్యమగు స్థానములు వాటిఫలితములు తెలియగలవు. అరచేతిలోని స్థానములను ప్రక్కన గల బొమ్మలో చూసి గ్రహించ గలరు.


79

శిరోరేఖ చంద్రస్థానము మీదకు వ్యాపించియున్న కవియగును. లేదా, ఏదో ఒక శాస్త్రములో విశేష పాండిత్యము కలవారగును. ఈ రేఖపై అడ్డరేఖలు ఉండక, చాలా విమలముగ ఉండుట మంచిది. ప్రక్కన గల 80వ బొమ్మను జూసి భావమును గ్రహించుము.


80

శిరోరేఖ మధ్య తెగిపోయి, ఖండ ఖండములుగవున్నచో విద్యాభంగము కలుగును. మరియు ఈరేఖ మధ్యలోగాని, ఎక్కడైనను గాని తెగియున్నచో ఆ వయస్సులో శిరస్సునకు బలమైన దెబ్బ తగలవచ్చును. లేదా, అనారోగ్యము కలిగి రోగపీడితులు కావచ్చును. శిరోరేఖ మధ్యమధ్య ఆవిధముగ తెగియున్నచో చాలాచెడు ఫలితములు కలుగును. ప్రక్కనగల 81వ బొమ్మను చూడగలరు భావమును అర్థం చేసుకోగలరు.


81

శిరోరేఖ మందముగా, అనగా వెడల్పుగా వుండక, సునిశితముగ విమలముగానూ ఉన్నచో మంచిఫలితములను ఉపయోగములను క జేయును.

శిరోరేఖ చేతిలో కురచగా ఉన్నచో మంద బుద్ధి కలవాడును. ఓర్పులేనివాడు విద్యలేని వాడును కుశాగ్ర బుద్ధి లేనివాడు అగుదురు. విద్యావంతులు కుశాగ్ర బుద్ధులు మేధావంతులు, కార్యాచరణయందు చతురత గల వారు అయినటు వంటివారి హస్తములలో ఈ రేఖ స్పష్టముగను విమలముగను కాంతివంతముగ వుండును. ప్రక్కనగల 82వ బొమ్మను చూచి పైవివరములు గ్రహించగలరు.


82



శిరోరేఖపై సూక్ష్మ రేఖలు అడ్డంగా వ్యాపించి ఖండించుచున్నను-కత్తెరలు, చతురంపాళీలు, నల్లనిపుట్టుమచ్చలు, వడ్లగింజవలె మధ్య మధ్య నున్ననూ-జీవితములో కష్టనష్టములు మనో విచారములు దరిద్రం దుఃఖములు కలుగును. ఈ రేఖ తేజో విహీనమయిన కొలది దురదృష్టవంతుడగును. 83వ బొమ్మను పరిశీలించగలరు.


83

ఈ రేఖ తరచుగా మూడు విధములుగా ప్రారంభమగుచుండును. కొందరి హస్తంలలో ప్రారంభములో కొంతవరకు ఆయుష్యరేఖతో కలిసి వ్యాపించి యుండును. కొందరి హస్తంలలో ఆయుష్యరేఖకు లోపలిభాగం నుండి ప్రారంభమగును. కొందరి చేతులలో ఆయుష్యరేఖతో కలియక విడిపోవు చుండును.

శిరోరేఖ, ఆయుష్యరేఖకి పై భాగములో గురుస్థానముమీద నుంచి బయలుదేరి చంద్రస్థానమునకు చేరి యున్నచో రాజకీయరంగములో ప్రవేశము కలుగును. రాజకీయనేత్తలై దేశ పరిపాలనా విషయములో ప్రవేశము కలుగును రాజకీయనేత్తలై దేశపరిపాలనా విషయములలో సమర్థులై, ఉన్నత పదవులు పొందు వారగుదురు. యోగ జాతకులు మహామేధావంతులగుదురు. 84వ బొమ్మను చూసి తెలుసుకోగలరు.


84

శిరోరేఖ-ఆయుష్యరేఖ నుండి ప్రారంభమై, దానినుండి ఒక శాఖరేఖపుట్టి, గురు స్థానము మీదకు వ్యాపించి యున్నచో, గొప్ప ఉద్యోగము చేయ గలుగును లేదా రాజకీయములలో ఉన్నతపదవులు కలిగి కీర్తిని సంపాదించు కొన గలుగుదురు. ప్రక్కనగల 85వ బొమ్మను చూసి తెలిసుకోగలరు.



85

శిరోరేఖ, ఆయుష్య రేఖకు లోపలిభాగమునుండి, అనగా రెండవ స్థానముమీద ప్రారంభమగుచున్న చంచలబుద్ధి కలవారుగను, ఆస్తిపరులుగ తన అభిప్రాయములు తరచుగ మార్చుకొనుచుండువారుగను, కార్యదక్ష లేనివారుగను యితరులను చూచి ఓర్చుకొన లేనివారుగను ఆశాభంగ పొందువారుగను, కుత్సిత ఆలోచనలు కలవారుగను అగుదురు.

ఈ శిరోరేఖ ప్రారంభములో ఆయుష్య రేఖలో కలియక విడిపోయివున్న అతిసాహసవంతులై-కోప స్వభావముకలవారగుదురు. రాజకీయముల ప్రతిభావంతులగుదురు వాక్చాతుర్యముతో ఎదుటవారిని మెప్పిం గలుగుదురు. ఈ రేఖ ప్రారంభములో చాలాదూరము వరకు ఆయుష్య రేఖ కలసి వ్యాపించి యున్నచో బాల్యదశకష్టములతో నిండియుండును చిన్నదశలో మందబుద్ధి కలవారుగను, దీర్ఘ ఆలోచనలు చేయువారుగను ఉందురు.

శిరోరేఖ-ప్రారంభమునుండి ఆయుష్య రేఖతో కలిసియున్నచో పురు సంతానము అధికముగా వుండును 86వ బొమ్మ చూడండి. ఆయుష్యరేఖ లోపలిభాగమునుండి శిరోరేఖ ప్రారంభమగుచున్న యెడల స్త్రీ సంతాన అధికముగా ఉండును.

ఈ రెండు రేఖలు కలిసియున్నచోట సూక్ష్మరేఖలు కొన్ని నిలువుగ వ్యాపించి, యీ రేఖలు స్పష్టముగను దృఢముగను వున్న యెడల పురుష సంతానమును సూచించును. అట్టి సూక్ష్మరేఖలు ఒకదానిపై ఒకటి వ్యాపించి కత్తెర రేఖలువలె యున్న గర్భస్రావమును, సంతాననష్టమును సూచించును.



86



ఈ రేఖలు-అనగా, శిరోరేఖ-ఆయుష్యరేఖలు ఒకదానికొకటి కలవక చాలా దూరముగ యుండిన, భార్యాభర్తలు విడిపోవుదురనియు కొందరు చెప్పు చుందురు రేఖలు యిలాంటి భావములను తెలియజేయును. "తయోరేవహి దాంపత్య వియోగేతు వియోగితాః అని చెప్పబడియున్నది మరియును....

'మాలిన్యేరోగ బహుళ్యం శైథిల్యేత్వంగభంగితా ।
వైవాహికఫలం సర్వసీమా రేఖాద్వయో ధృవమ్ ॥

సంతాన విషయముబాగా ఆలోచించునపుడు గురుస్థానమును దాంపత్య విషయములు ఆలోచించునపుడు శుక్రస్థానమును పరిశీలించి ఫలితములు నిర్ణయం చేయవలయును, తొందరపడి అశుభములు చెప్పక, బాగుగా హస్తము పరిశీలించి ఫలితములు చెప్పవలెనన్ననూ, పలుగ్రంథముల పరిశీలన కావలయును.

శిరోరేఖపై ఒకరేఖపుట్టి ఊర్ధ్వ ముఖముగ పైకి వ్యాపించి సూర్యస్థానము మీదకుపోయి, అక్కడ అంత్యమైనచో గొప్ప రాజకీయ నాయకుడగును లేదా, ఏదైనా ఒక శాస్త్రములో గొప్ప పండితులగును. మంచి పదవులలో వుందురు. ప్రజాధికారము చేయుదురు. ప్రక్కనగల 87వ బొమ్మను పరిశీలించగలరు.



87

ఈ శిరోరేఖపై ఒక రేఖపుట్టి ఊర్ధ్వముఖముగ పైకి వ్యాపించి బుధస్థానము మీదకు వ్యాపించియున్నచో, రాజకీయరంగమున ఉన్నతపదవులు కలిగి, దేశ వ్యాప్తమైన కీర్తిని పొందువారగుదురు అది ఒక మహత్తరమైన రాజయోగము.

ఇట్టి ఊర్ధ్వరేఖ ఒకటి శనిస్థానంమీదకు వ్యాపించి యున్నచో పలురకములు అనగా అపరాలు మొదలుగు పంటలపైనను. వ్యవసాయ మూలముగను విశేష ధన సంపాదన కలుగును తద్వారా మహర్జాతకులు కాగలరు.

శిరోరేఖపై పుట్టిన రేఖపైకి పోయి ఆత్మరేఖ వరకు వ్యాపించి అక్కడ ఆగిపోయినచో ప్రేమభంగమును, స్త్రీ పురుషులు విడిపోవుటయును, ఆ తరువాత జీవితములో కష్టములు కలుగును మానసిక సంఘర్షణతో అశాంతి గురి అగుదురు.

హస్తములో రెండు శిరోరేఖలుడున్నచో అసాధారణమైన మేధాశక్తి కలవారుగను, భవిష్యత్తులో ఏమి జరుగునో చెప్పగలశక్తి గలవారుగను, అద్వితీయమైన మేధాశక్తి సంపన్నులుగను, విశేషధనవంతులుగను, శాస్త్రజ్ఞానముచే ధన సంపాదన చేయు వారును అగుదురు. అట్టివారికి ప్రపంచ వ్యాప్తమైన కీర్తి కలుగును 88వ బొమ్మను చూడండి. యీ శిరోరేఖ చాలా చిన్నది గానూ, పొట్టిగనూ యున్నచో తెలివితేటలు లేనివాడును, మందబుద్ధి గలవాడును, సామాన్యమై జీవితము గడుపువాడును ఇతరులు చెప్పిన పనులు చేయు చుండువాడును స్వతంత్రమైనశక్తి లేనివాడును అగుదురు.



88

ఈ శిరోరేఖ చేతిలో లేకున్నచో మందబుద్ధికలవాడును లోభిగను కార్యము చేయలేనివాడుగను, పశుజీవితంవంటి జీవితమును గడిపివేయువా గను, సామాన్యుడుగాను వుండును. జీవితమును కడు దుర్భరముగ గడ గలుగుదురు. ఈరేఖ కురచదిగా, చిన్నదిగాయున్న అల్పాయుర్దాయమున సూచించును అనగా బహుకొద్ది సంవత్సరముల జీవితముగా వుండగలదు.

శిరోరేఖ చివరభాగము చీలియున్నచో-జ్యోతిష శాస్త్రవేత్తగను, కేరళ ప్రశ్నలు చెప్పగలవారుగను, భూత- భవిష్యద్వర్త మానములు ఆశ్చర్యముగ చెప్పగలవార గును. 89వ బొమ్మను చూడండి. ఈరేఖపై నక్షత్రమువంటి గుర్తువలన ప్రమాదము ఆ వయస్సులో శిరస్సుకి కఠినమైన దెబ్బతగిలి ప్రమాదము కలుగును.



89

శిరోరేఖ చంద్రస్థానముమీదకువాలి, చివర నక్షత్రం వంటి గుర్తువున్న -నీటిగండము. శిరోరేఖ పూర్తిగా మణికంకణ రేఖలుమీదకు వాలి చివర కత్తె గుర్తువున్నచో ప్రమాదములలో దుర్మరణము పొందువారగుదురు. శిరో



శనిస్థానము క్రింద ఆగిపోయి చివర కత్తెర గుర్తువున్నచో-అల్పాయుర్దాయము. రేఖపై ఎక్కడైనను కత్తెరగుర్తు వున్నచో ఆకస్మిక అపాయమును సూచించును. మొదటి కుజస్థానమునకు దగ్గరగా శిరోరేఖపై నలుపు లేక నీలిరంగు మచ్చ వున్నచో హత్యలు చేయువాడగును.

ఈరేఖ చేతిలో అస్పష్టముగనుయున్ననూ ఖండఖండములుగ తెగియు న్ననూ గొలుసువలెయున్ననూ కళావిహీనముగ యున్ననూ-కత్తెరలు-నక్షత్రము వంటి గుర్తులున్ననూ జీవితములో కష్టములు తరచుగా కలుగుచుండును.

ఈ శిరోరేఖ పాలిపోయినట్లుగా వున్నచో, లేక, లోతుగ, (బర్రిగ) వెడల్పుగ యున్నచో -కూలిపని చేసుకొనుచూ, అజ్ఞానులై, శరీర కష్టముతో జీవించు వారగుదురు. అందుచే ఈరేఖ విమలముగా కాంతివంతముగా, విపులముగా వుండుట ఒక మంచి యోగము పై వివరములు 90వ బొమ్మను చూచి తెలుసుకోగలరు.



90

అరచేతిలోను, రేఖలపైనను ఉండు కొన్ని గుర్తులు.



# రవిరేఖ

రవి అనగా సూర్యుడు రవిరేఖ కీర్తిని తెలియజేయును ఈరేఖను సూర్య రేఖ అనియూ. కీర్తి రేఖఅనియూ కూడా అందురు. రవిరేఖ చేతిలోని ప్రధానమైన రేఖలలో ప్రముఖమైనదిగా చెప్పబడు చున్నది. రవిరేఖ అరచేతి క్రింది భాగమున, అనగా చంద్రస్థానము, శుక్ర స్థానములకు మధ్యగా గల ధనరేఖకు ఎడమ వైపుగా కంకణరేఖల పైభాగమునపుట్టి రవిస్థానము మీదకు వ్యాపించుచుండుట వలన ఇది రవిరేఖ యని పిలవబడుచున్నది. ఇకనూ ఈ రేఖ విద్యారేఖ అని కూడా చెప్పబడుచున్నది. భూమికి సూర్యుడు ఎంతముఖ్యమో అర చేతిలో ఈ రవిరేఖ అంతముఖ్యము. ఈ రవిరేఖ మేధస్సుకు సంబంధించిన రేఖగా కూడా చెప్పబడెను. 91వ బొమ్మను చూసి తెలిసుకోగలరు.



91

అరచేతిలోని స్థానములు వివరములను తెలుసుకొనిన రవిరేఖ వ్యాపించు విధానములు వాటి ఫలితము తెలియును. దిగువగల అరచేతిలోని స్థానముల 92వ బొమ్మను చూడండి. రవిరేఖ గురించి ఒక విధముగా చెప్పవలసియున్న అదృష్టరేఖ అని చెప్పవలసియున్నది. చేతిలో ధనరేఖ కంటే రవిరేఖయే చాలా గొప్పది మంచిది ఇది అందరి హస్తములలోను కన్పించదు. ఈరేఖ అరచేతిలో వున్నచో ఆవ్యక్తి అదృష్టవంతు డనియే చెప్పవలయును.



92



ఈరేఖ గొప్ప విద్యావంతుల హస్తములలోను గవర్నమెంటులో పెద్ద ఉద్యోగము చేయుచున్నవారి హస్తములలోను, లేదా వ్యాపారముచేసి లక్షలు సంపాదించువారి హస్తములలో మాత్రమే ఉండును. సామాన్యుల హస్తములలో ఉండదు. ఈ రవిరేఖ కీర్తియును, గౌరవమును పెంపొందించు రేఖగా కూడా చెప్పబడెను. హస్తములో ఈ రేఖ ఉండుట గొప్ప అదృష్టయోగము. రవిరేఖ చాలామంది హస్తములలో ఆత్మరేఖ మీద నుండి ప్రారంభమై రవివ్రేలు క్రింద వరకూ వ్యాపించు చుండును 93వ బొమ్మను చూడండి. యీ విధముగా వున్నచో వృద్ధాప్యములో జీవితము సుఖముగను, యోగదాయ కముగను, ఉండును. అనగా వయస్సు యాభైఐదు సంవత్సరములు దాటిన పిదపయోగవంతముగా ఉండును.



93

రవిరేఖ లేనిహస్తములలో ధనరేఖయున్నను, జీవితము అంతయోగ ప్రదముగా ఉండదు చేతిలో రవిరేఖ లేనపుడు ధనరేఖయున్నను అట్టి ధనరేఖ వలన ప్రయోజనము అంతగా వుండదనియే చెప్పవలసియున్నది. చేతిలో రవిరేఖ వున్నవారు దైవబల సంపన్నులనియే చెప్పవలసియున్నది గొప్పయోగములు కూడా ప్రాప్తించునని చెప్పవచ్చును.

చేతిలో రవిరేఖయున్నచో విద్య, గొప్ప వాగ్ధాటి, సంఘజీవితములో ఉన్నత స్థానము ఐశ్వర్యము, ఎదుటివారి హృదయములకు ఆనందము కలుగునట్లు మాట్లాడుశక్తి సకలవిషయములందును ఔన్నత్యము కలుగును. ఈరేఖ యున్నప్పుడు రవిస్థానము కూడా ఉచ్చెగా, అనగా ఉబ్బెత్తుగా, విమలముగా ఉండవలయును రవిస్థానం ఉచ్చెగా లేక నీచముగా (అనగా ఎత్తుగా లేక, పల్లముగ)వున్నచో, రవిరేఖ తన ప్రభావమును జూపించలేదు పూర్తిగా ప్రభావము తగ్గిపోవును.

రవిరేఖ శుక్రస్థానముమీద ప్రారంభమై, రవిస్థానంమీదకు వ్యాపించి యున్నచో భార్య సహాయమువలనగాని, అన్యస్త్రీ యొక సహాయమువలనగాని గొప్ప అభివృద్ధి కలుగును. శుక్రుడు సంగీతము సాహిత్యము, నాట్యకళాచిత్ర లేఖనము, నాటకకళ మొదలగు వాటికి కారకుడుగా వున్న అట్టి కళానైపుణ్యము వలన అభివృద్ధి లోనికి వచ్చును 94వ బొమ్మను పరిశీలించి తెలుసుకోగలరు.



94

ఈరేఖ చంద్రస్థానము మీద ప్రారంభమై, రవిస్థానముమీదకు వ్యాపించి యున్నచో సంగీతం, కవిత్వము, భరత నాట్యము నాట్యకళ చిత్రలేఖనము మొదలు కళలలో నిపుణత కలిగి, దేశవ్యాప్తమైన కీర్తి సంపాదించుటయేగాక విశేష ధనసంపాదన కూడా కలుగును. 95వ బొమ్మను చూడండి.



95

రవిరేఖ, చేయిమధ్య భాగంనుంచి ప్రారంభమగుచున్న యెడల, వయస్సు నలభై లగాయితు మంచియోగమును కీర్తియును, ధనసంపాదనమును కలుగును. ఈ రేఖ చివరిభాగంలో కుచ్చువలె, పెక్కు సూక్ష్మరేఖలు కలిగియున్న, రాజకీయ జీవితములో ఉన్నతపదవి కలుగును. మరియు, అనేక విధములుగను, అనేక రకములగను వ్యాపారమువలన, విశేష ధనాదాయము కలవారగును గొప్ప ఐశ్వర్యవంతులగుదురు.

రవిరేఖ అంత్యంనుండి ఒక శాఖరేఖ బయలుదేరి గురుస్థానం మీదకు వ్యాపించి యున్నచో రాష్ట్ర లేక కేంద్ర ప్రభుత్వములలో మంత్రియగును. ప్రజాధికారియగును. అనేక ప్రజోపకార కార్యములు చేసి గొప్ప కీర్తిని పొంద గలుగుదురు. 96వ బొమ్మను చూసి తెలుసుకోగలరు.



96



రవిరేఖమీదనుంచి పుట్టినశాఖ రేఖ, శనిస్థానముమీదకు వ్యాపించి యున్నచో గొప్ప కీర్తిని, విశేష ధనాదాయమును కలుగజేయును. అట్టి శాఖరేఖ బుధస్థానము మీదకు వ్యాపించియున్నచో, వ్యాపారమూలముగా విశేష ధన లాభము కలుగును. రవిస్థానముమీద గొడుగువంటి ఆకారము కలిగిన రేఖ (ఛత్రరేఖ)వున్నచో రాజగును. లేదా, ప్రజాధికారముగల గొప్ప ఉద్యోగియగును. ప్రజామన్ననలు కూడా పొందగలుగుదురు. యిలాంటి రేఖ, హస్తమునందు ఉండుట మిక్కిలి అదృష్టము యిది ఒక గొప్ప రాజయోగము.

కుజస్థానము మీద బాణమువంటి రేఖవున్నచో విశేషభూములు కలవార గుదురు అరచేతిలో సూర్యుడు, చంద్రుడు, ఏనుగు, అశ్వము వంటి రేఖలున్నచో సకలభోగభాగ్యములతో సుఖముగ జీవితమును గడుపుదురు. కుండ, చేతిగాజు మనుష్యుని తలవంటి రేఖలు వున్నచో రాష్ట్రమునకు మంత్రి యగును. చేతిలో శంఖమువంటి రేఖ వున్నచో గొప్ప మేధావులుగ యుండి, ప్రపంచవ్యాప్తమైన కీర్తి పొందువార గుదురు.



97

మత్స్యరేఖయున్నచో విశేష ధనవంతుడగును చేతిలో పద్మరేఖవున్నచో ధనవంతుడును, పూర్ణాయుర్దాయము కలవాడును. గొప్ప యోగపురుషుడును అగును. సాముద్రిక శాస్త్రములో అనుభవమునుబట్టి ఈరేఖలను గుర్తించ గలుగుదురు పైనగల బొమ్మను చూచి, అందుస్థానమును తెలుసుకొని రేఖలను తెలుసుకొని, పైనయిచ్చిన వివిధగుర్తులు గలచోట్లను చూచుకొని ఫలితములు గ్రహించవలయును.

రవిరేఖ మీదగాని, రవిస్థానం మీద గాసీ నక్షత్రమువంటి గుర్తువున్నచో, గొప్ప అదృష్టమును, కీర్తిని కలుగజేయును. 98వ బొమ్మను చూచి తెలుసుకోగలరు. రవి స్థానముమీద కత్తెరగుర్తు మంచిదికాదు. అపజయమును, అపకీర్తిని విద్యాభంగమును,



98

దురదృష్టమును కలుగజేయును. రవిరేఖఖండములుగా తెగి యున్న ఏవృత్తియందు నిలకడగా వుండక, అస్థిరమైన జీవనోపాధి కలవాడ గు మరియు దరిద్రమును, తరచుగా కష్టములను కలుగజేయును. జీవన బహుదుర్భరముగా యుండి, మనోధైర్యమునడలును.

రవిరేఖ, ధనరేఖ మీదనుంచి ప్రారంభమగుచ్చుచో గొప్ప అదృష్టవంతు డగును. ఏవయస్సునుంచి రవిరేఖ ధనరేఖ మీదనుంచి ప్రారంభమగుచున్నదో, ఆవయస్సులో అప్రయత్న పూర్వకంగా ఆకస్మిక ధనలాభము కలిగి, అది లగాయితూ జీవితమునందు గొప్ప అదృష్టము కలుగును. 99వ బొమ్మను జూడగలరు. గొప్ప ఐశ్వర్యవంతులయి, కీర్తిప్రతిష్టలు పొందగలుగుదురు.


99

రవిరేఖ, ఆయుష్యరేఖపై పుట్టి సూర్యస్థానము మీదకు వ్యాపించి యున్నచో ఏదయిననూ ఒకకళలో గొప్ప ప్రవీణుడై, దేశవ్యాప్తమైన కీర్తిని సంపాదించి, విశేష భోగభాగ్యములతో తులతూగు చుండును. 100వ బొమ్మను చూడండి.


100

రవిస్థానముమీద బాగుగా కనిపించు నల్లని పుట్టుమచ్చ ఉద్యోగభంగమును, అపకీర్తిని, దరిద్రమును గలుగజేయును.

రవిరేఖ ఉన్న హస్తములో రవిస్థానం మీద కత్తెరగుర్తులు ఉన్నచో, జీవితములో సులభముగ అభివృద్ధి గాంచగలుగును. మంచినీ సూచించును. ఇది ఒక యోగము.



రవిస్థానముమీద వలయమువంటి గుండని రేఖ విమలముగను స్పష్టము నున్నచో అప్రయత్న పూర్వకముగ విశేష ధనలాభము కలుగును. ఈగుర్తు లాటరీ మూలమునకూడా ధనలాభంలు కలుగజేయ వచ్చును. 101వ బొమ్మను పరిశీలించి తెలిసు కోగలరు.


101

అరచేయి మధ్యభాగమున గొయ్యివలె పల్లముగా లేక చొట్టగాయున్నచో, రవిరేఖ యున్ననూ-విశేషయోగం పట్టదు గనుక, గమనించి ఫలితములు నిర్ణయించి తెలుసు కోవలెను.

రవిరేఖ విమలముఉండి గురుస్థానము మీదకు వ్యాపించియున్నచో ప్రభుత్వములో వున్నత పదవులు లభించును. రాష్ట్ర లేక కేంద్ర ప్రభుత్వములో మంత్రి పదరేఖలు లభించును.

రెండు విరేఖలు విమలముగాను, కాంతివంతముగను ఉండి రవిస్థానము మీదకు వ్యాపించియున్నచో లక్షలు, కోట్లు, సంపాదన కలవారగుదురు. అష్ట ఐశ్వర్యములు యోగించును.


102

రవిరేఖ చివరిభాగములో రెండు శాఖలుగా చీలి ఒకశాఖ, బుధస్థానము మీదకును, ఇంకొక శాఖరేఖ శనిస్థానం మీదకు వ్యాపించి యున్నచో కీర్తిపొందే రాజ్యపదవులు యోగించును. 102వ బొమ్మను పరిశీలించి తెలిసికోన గలరు.

# బుధరేఖ

అరచేతిలోగల బుధస్థానమునుండి (అనగా చిటికెనవ్రేలు క్రిందగలస్థానం నుండి)ప్రారంభమై హస్తములో క్రిందుగా వ్యాపించి శుక్రస్థానంవద్ద ధనరేఖకు ప్రక్కగా ఆయుష్యరేఖను కలిగియును. దీనిని బుధరేఖ అనియు వ్యాపారరేఖ అనియు, ఆరోగ్యరేఖ అనియు అందురు. 103వ బొమ్మను పరిశీలించి తెలుసు కోగలరు.



103

ఈబుధరేఖ వ్యాపారమును, శాస్త్రమును, తంత్రమును, ఆరోగ్యము గణితమును తెలియజేయును. ఈరేఖయందు అడ్డగాను, చీలికగాను, చిన్న రేఖలు వున్నయెడల జీర్ణశక్తిని, ప్రేగుల బాధలను కాలేయమునకు సంధించిన వ్యాధులను వాటి బాధలను హెచ్చింపచేయును. ఈరేఖ చంద్రస్థానమునకు వ్యాపించియున్నచో కామెర్లరోగి అయి అనారోగ్యము కలుగును.

బుధరేఖపై లంక, వడ్లగింజ గుర్తులు వున్నచో దీర్ఘవ్యాధులకు గురి అగుదురు ఆపరేషన్లకు కూడా అవ కాశమున్నది. ఈ బుధరేఖ సన్నగా వంకర టింకరలు లేక అడ్డరేఖలు లేక వివరంగా కాంతి వంతముగా యున్న గొప్ప వ్యాపారం చేయుగలదని చెప్పవచ్చును. చేతిలో బుధ రేఖలు అస్పష్టంగా వుండుట అనారోగ్యమును సూచించును. 104వ బొమ్మను పరిశీలించి చూడగలరు. పై ఫలితములను గుర్తించ గలరు. అరచేతిలో రేఖలపై వుండు గుర్తులు



104



| | |
|---|---|
| . మత్స్యము | 5. శంఖము |
| 2. చంద్రుడు | 6. నక్షత్రము |
| 3. గిరులు, తరులు | 7. త్రాసు |
| 4. సూర్యుడు | 8. కమలము |



# ఆత్మరేఖ

అరచేతిలోగల ఆయుష్యరేఖకు లోపలిభాగములో బొటనవ్రేలుకు ప్రక్కగా గల రెండవ కుజస్థానం నుండి ఈ కుజరేఖ ప్రారంభమై ఆయుష్యరేఖ ఆవెంబడి సమానంతరముగా శుక్ర స్థానములో దిగువవరకు వ్యాపించును. దీనినే కుజరేఖ అని అందురు. 105వ బొమ్మను చూడగలరు. కుజరేఖ సాహసమును, అన్యస్త్రీ పరిచయమును, అనారోగ్యమును, కళత్ర విషయమును తెలియజేయునని గ్రహించ వలెను.



105

ఈ రేఖ ఉండుటనుబట్టి మంచిశక్తి సామర్ధ్యములు కలవారని తెలియ వలెను. పట్టుదల, సహనం, ఓర్పు వీరికి సహజముగానే వుండునని చెప్పవచ్చును. గొప్పధైర్య, పౌరుష, పరాక్రమములు వీరికి సంపదగా యుండును. మంచి యోగశాఖ. ఆయుష్యరేఖకు అడ్డగా రేఖలు వుండిన ఆయుర్దాయమునకు భంగము వాటిల్లు సందర్భములో ఈ కుజరేఖవల్ల ఆభంగము తప్పిపోవును. రేఖ నిమలములు నిర్ణయించరాదు. ఈరేఖ ఆయుష్యరేఖను ఖండించి, ధన రేఖను తాకిన బంధువుల ప్రభావము, వీరిపట్ల ఇబ్బందులకు గురిచేయును తాను ప్రేమించు వ్యక్తులవల్ల కూడా కష్టముల పాలగుదురు. వారి ప్రభావము యితరులలో సన్నగిల్లును.

# శుక్రవంక-గురువంక-శనివం

(శుక్ర, గురు, శని, మండల రేఖలు)

## 1. శుక్రవంక

**శుక్రరేఖ:-** ఈరేఖ చూపుడువ్రేలునకు అనగా గురువ్రేలునకూ మధ్యవ్రేలు నకూ మధ్య, ప్రక్కబొమ్మలో చూప బడిన విధముగా ప్రారంభమై అర్ధ చంద్రాకారముగా మధ్యలో క్రిందకు వంపులిరిగి చిటికెనవ్రేలునకు, రవివ్రేలునకు (ఉంగరపువ్రేలు) మధ్యలో అంత్యమగుచుండును. దీనినే శుక్రవంక అని అందురు. 106వ బొమ్మను చూడండి, మంచి యోగ ఫలదాయకమైన రేఖ.



106

కొందరు ఈరేఖను అంత విశేష ప్రాముఖ్యమయున రేఖగా, పరిగణింప దీని విషయమై అంతగా అలోచించుటలేదు. కాని ఇది చేతిలోనుండు రే లన్నింటినిలో ఒక ముఖ్యమయిన రేఖ. ఇదిచేతిలో సక్రమము వ్యాపించిచూన్నచో ప్రతిభ కలవారును, వాటియందు కీర్తిని సంపాదించువారు పండితులను, సాహిత్యవేత్తలతో కలిసియుండు వారును, మంచిఅగుదు కాని యా రేఖ సక్రమముగా యుండక ఖండఖండములుగా తెగియున్న అస్పష్టముగను, పాలిపోయినట్లుగను వున్నచో చెడ్డప్రవర్తనను కలుగజేయును అనగా అట్టివ్యక్తి దుర్వ్యసనములకులోనై, ఏ పనియు శ్రద్ధగాజేయక సోమరి జీవితమును వృధాగా గడిపివేయును.

శుక్రరేఖ చేతిలో లేకుండటయే శ్రేయస్సు అనియు యిదిచేతియందు డుట దురదృష్టకరమేయనియు కొందరు చెప్పుచున్నారు. కాని అట్టి అ ప్రాయములు సరియైనవికావు రేఖ మలినముగను, కండములు-అనగా ము ముక్కలుగ తెగినట్లున్నచో వారి అభిప్రాయము సరియైనదే యగును. కా శుక్రరేఖ స్పష్టముగయుండి, జీవకళ ఉట్టిపడుచున్నట్లున్నచో- గొప్ప సాహి వేత్తలు సభాపూజ్యులు, యోగ్యులు పండితులచే గౌరవంగ చూడబడుచుం వారగుదురు. కొందరి హస్తములలో ఈ శుక్రరేఖ ఒకదాని ప్రక్కఒకటి జం



ఖలువలె రెండు నుండి మూడు రేఖలు వరకు ఉండును, వ్యభిచారిగను, దా సదా భోగలాలసులుగను, సదాసుందరముగనుండు స్త్రీల పొందుకోరుచుండువారుగను నుందురు, మంచి యోగములు, భోగములు ఏర్పడును.

రేఖ ముక్కముక్కలుగాతెగి, అస్పష్టముగా యుండి బళాహీనముగా యున్న యెడల నీచ స్త్రీగల సాంగత్యం కలవాడును. వ్యభిచారిణులతో కలిసియుండి, దూరకృత్యములు కూడ చేయుచూ అందుమూలముచే జీవితం కడుపుచుండువాడును. అగును. కడు దుర్భరమగు జీవనము చేయును. వ్యభిచార వృత్తిలో తిరుగుచు నీచప్రవర్తనకు అలవాటుపడి భ్రష్టుడగును పదిమందిలో స్నేహితులలో, బంధువులలో అపఖ్యాతిపొంద గలవాడగును. మరియు యీ శుక్రరేఖ మలినముగాయయుండి చేతిలో గురు-శుక్ర-బుధ-చంద్రస్థానములు కూడా నీచంగా యున్నచో, కలు-సారా మొదలగు మత్తుపదార్ధలకు అలవాటు పడును. సమస్త దుర్గుణములకులోనై జీవితము పాడుచేసుకొనుచు. ఈ ధనరేఖ రవి, బుధరేఖ మీదుగా వ్యాపించి వున్నయెడల తుదకు పిత్రార్జిత ధన, భూ గృహములను చారమువలన పోగొట్టుకొని నానావిధ సుఖరోగములచే బాధపడుచు, వృద్ధాప్యమున కష్టమైన జీవితము గడపవలసినవారగురు. ఎన్నో ఇక్కట్లుకులోనయి జీవితము చాలించుదురు అందుచే యీ శుక్రరేఖ విమలముగా వుండవలెను.

శుక్రరేఖ ఆత్మరేఖకు పై భాగమున ఉండును అందుచే ఈరేఖ వివాహము, ప్రేమ, అన్యస్త్రీ సంపర్కము, కామ విషయములు వాటి స్వభావం మొదలగు విషయములను గురించి తెలుపు చుండును. రేఖ విమలముగ, కాంతిగావున్న యోగము 107వ బొమ్మను చూడండి.



107

ఆత్మరేఖకు పైభాగమునుండి,చిటికెనవ్రేలు క్రిందభాగమున వివాహ రేఖలుండు ప్రదేశంనుండి అరచేతి అంచునుండి వివాహరేఖవంటి ఒకశాఖ ప్రారంభమై శుక్రరేఖమీదకు వ్యాపించియున్నచో, తాను ప్రేమించిన స్త్రీవలన అనేక కష్టములకు లోనగుటచే జీవితం ధ్వంసం చేసుకొనును. శుక్ర, చంద్ర స్థానములు ఉన్నతముగ యుండి ఈ రేఖపై అడ్డరేఖలున్న, నానావిధములయిన సుఖ వ్యాధులకులోనై ఆ వ్యాధులు అనివార్యములై, దుర్భరమైన అనారోగ్యముచే పీడింపబడుచుండును.శుక్రరేఖ స్పష్టముగవుండి, రవిస్థానంపై ఒక రేఖచే

ఖండింపబడుచున్నచో, వ్యభిచారమూలమున ఆస్తినంతయు పోగొట్టుక
అపకీర్తి పాలగును. ఈరేఖపై నక్షత్రమువంటి గుర్తువున్నచో తప్పనిసరియ
సుఖవ్యాధులచే పీడింపబడును తుదకు అట్టి వ్యాధులవలననే మరణించు

శుక్రరేఖ జీవకళ కలిగి ఎరుపురంగులోయుండి సుస్పష్టముగను, ధృఢ
గసు యుండి అదృష్టరేఖచే ఖండింపబడుచున్నచో, విద్యయందశక్తి కలవారుగ
చతురులుగను అగుదురు. మరియు యిట్టి గుర్తుగల వ్యక్తులకు స్త్రీమూలము
విశేష ధనలాభము కలుగును. అనగా ధనవంతురాలయిన స్త్రీలతో పరిచ
కలిగి, ఆ స్త్రీ యొక్క ధనముతో సకల భోగభాగ్యములతో జీవితమును
దాయముగా గడుపుచుందురు. యిది ఒక యోగము గొప్పగా యోగించు

ఈశుక్రరేఖ ముక్కలుముక్కలుగయుండి నీచముగయున్న చేతిలో, శ
చంద్రస్థానములు ఉన్నతముగయుండి శుక్రస్థానముపై జల్లెడవంటిరేఖలు వి
ముగాయున్నచో భోగలాలసుడై, సోమరితనముగ తిరుగుచూ, త్రాగుడు-
చారము-జూదము మొదలగు దుర్వ్యసనములకు లోనగును. జీవితము దు
రముగా యుండును. శుక్రరేఖచేతిలో స్పష్టముగను విమలముగను వ్యాపిం
యుండి గురు,చంద్ర, బుధ,శుక్రస్థానం ఉన్నతముగను,విమలంగ
యుండి,శిరోరేఖ బాగుగాయున్నచో దేశప్రఖ్యాతిగల కవియో,సం
విద్వాంసుడో యగును.

# గురువంక

## (గురురేఖ)

**గురువంక:-** ఈరేఖ గురువ్రేలు క్రింద, గురుస్థానంపై అడ్డముగ చంద్రవంక వలె, మధ్యభాగంలో విల్లువలె కొంచెము వంపు తిరిగి 108వ బొమ్మను చూసి తెలుసుకో గలరు. ఈ రేఖ గురుస్థానంపై ఉండుట వలన-విద్య విజ్ఞానము పాండిత్యము, ఏదైనా ఒక విద్యయందు విశేషమయిన గొప్పశక్తి, ప్రజ్ఞ, నిపుణత కలిగియుండును. గురువంక గలవారు సాధారమేుగా జ్యోతిషశ్శాస్త్ర ప్రవీణులుగా నుండుట మేము చూచుచున్నాము.



108



ఈ రేఖగలవారు మంత్రశాస్త్రమునందు కూడా ప్రవీణులగుచున్నారు. కొందరు ఉపాసనాశక్తి సంపాదించుకొని, కేరళ ప్రశ్నఫలములు చెప్పుచుందురు. కొందరు పాము మంత్రం, తేలుమంత్రములు మొదలగు మంత్రములచే ప్రజల బాధ తొలగించుచూ, పేరు ప్రతిష్టగలవారగుచున్నారు. మొత్తముమీద ఏదో ఒక రహస్యమయిన విద్యాశక్తిచే రాణించుచున్నారు. కొందరుమామూలు విద్వాంసులుగను, పండితులగను, కవులుగను, సాహిత్యవేత్తలుగను వున్నారు. యిట్టిరేఖ హస్తమునందు వుండుటచే గురుబలము యోగించును. గురువు విద్యాకారకుడు, కావున గొప్పయోగము. అందుచే అట్టి గురుస్థానముపై ఉండు ఈరేఖ విద్యా విషయములనే చూచించుడు.

హస్తమునందు రేఖలపై ఉండు కొన్ని గుర్తులు.





# శని వంక

## (శనిరేఖ)

**శనివంక:-** ఈ రేఖ శనివ్రేలు క్రింద శనిస్థానముపై అడ్డముగా చంద్రవంకవలె వ్యాపించి యుండును. ఇది సాధారణంగ చేతులలో ఎక్కడనోగాని కన్పించదు. ఇది చేతి చెడ్డగుర్తు చేతిలో ఈరేఖ గలవారు సోమరులై ఏమియుచేయక కాల మును వృధాగా గడుపుచుందురు. ఒక వేళ వీరు ఏపనినైనను చేయ ప్రయత్నించి నను, ఆకార్యము నెరవేరక పురిటియందే సంది గొట్టుచుండును. గొప్పగా



109

సాహసించి ఏమియుయూ చేయక ఆలోచనలతో కాలం గడుపుచుంద 109వ బొమ్మను చూడండి. హస్తమునందు ఈ రేఖవుండుట ఒక అపయోగ అయితే ఈఫలితములు శనిస్థానము (పల్లముగ) నీచముగ యున్నచో యెక్కువగా బుజువుఅగును.

ఈ శనివంక గలవారు ఒంటరిపాటుగ వుండుటకు ప్రయత్నించు తనవారితో కలిసియుండక, ఏకాంత జీవితముగడుపుచుందురు. ఇంచుమి యిది ఒక సన్యాసయోగం సదా మనోవిచారముతో, ఈర్ష్యాస్వభావము కాలము వెళ్ళబుచ్చుచుందురు. కడుదయనీయమైన జీవనం చేయుదు ఇట్టివారిని శనివ్యక్తులని చెప్పవచ్చును. సాధారణంగా వీరికి వివాహంతే ఒకవేళ వివాహము అయిననూ భార్యతో కలిసివుండట జరుగదు. ఏదీ కూలి ఆరోజు సంపాదించుకొని నిత్యదరిద్రముతో కష్టభాజనముగ కాల గడుపు చుందురు. ఇట్టి జీవితము చివరకు ఏదో ఒక ఆపదలో చిక్కు అంత్యమగు చుండును. హస్తములో ఈరేఖను చెడుగా గుర్తించి ఫలితము గ్రహించవలెను.

# కంకణ రేఖలు

అరచేయి దిగువన గల మణికట్టును చుట్టుకునుండు రేఖలు మణిబంధన రేఖలు లేక కంకణరేఖలని అందురు. యివి హస్తములలో 1,2,3 రేఖలుగా వుండును. ఈకంకణరేఖలపై దుష్ట చిహ్నములు లేకున్నచో బంగారు కంకణములు రత్నములు పొదగబడిన వస్తువులు మొదలగు విలువయిన ఆభరణములను ధరించగలుగుదురు. చెడ్డచిహ్నం వున్నచో కఠిన కారాగృహశిక్షతో మొదలుకొని అనేక యితరమయిన కఠినశిక్షలపాలగుదురు.


110

మణికట్టున మూడు కంకణరేఖలువున్నచో విలువైన భూషణముల ధరించువారగుదురు. ఈమూడురేఖలు విమలముగా, కాంతివంతము వున్నచో, ఆరోగ్యము, ఐశ్వర్యములతో సుఖముగా జీవింతురు. 110వ బొమ్మ చూడగలరు.



కంకణరేఖలు రెండుండిన సామాన్యమైన జీవితము గడుపువారగుదురు అయిననూ గుణవంతులుగనూ సత్యశీలురుగను వుందురు. 111వ బొమ్మను చూడగలరు. ఈ కంకణరేఖల నుండి మరికొన్ని రేఖలు ఊర్ధ్వముగా (పైకి) వ్యాపించుచూ చంద్రస్థానముకు పోయిన ఖండాంతరాలకుగానీ దూరదేశంలకుగానీ ప్రయాణము చేయుదురు.


111

కంకణరేఖలు ఒక్కరేఖ మాత్రముగానే వున్నపుడు యాచకవృత్తి లేక, భిక్షాటనవృత్తిగా జీవించువాడగును. మిక్కిలి కష్టలకు లోనగు వాడగును. వీరి జీవితము కడుదుర్భరము. 112వ బొమ్మను చూడండి మూడు రేఖలలో మొదటి కంకణరేఖ, మధ్యభాగములో ధనుస్సువలె అర చేతిలోనికి వంపు తిరిగి పైకి వ్యాపించి యుండిన లాటరీమూలమునగానీ, అన్యస్త్రీ సంపర్కం మూలమున గాని, ఆకస్మిక విశేషధనలాభము, వారసత్వమురీత్యా భూగృహములు కలవారుగను ఉందురు. మూడు కంకణరేఖలు వరుసగా ఒకదానిపై ఒకటి విరిగి యుండిన దురభి మానము కలవారుగను. ఆపదలకు కష్టమునకు లోనగుదు రనియు తెలియవలెను. మహారాజులకు మణికట్టుపై నాలుగు రేఖలు ఉండును. అందుచే వారికి గొప్పరాజయోగములు పట్టును. మన"సాముద్రిక గ్రంధము"లలో కంకణరేఖల విశేషముగ చెప్పబడియుండ లేదు.


112

# వివాహరేఖలు

అరచేతిలోని బుధస్థానములో అనగా చిటికెనవ్రేలు క్రిందభాగంలో చేతికి చివర అంచునుండి అడ్డంగ వ్యాపించు రేఖలను వివాహరేఖలు అని అందురు. 113వ బొమ్మను పరిశీలించగలరు. కొందరు వీటిని ప్రేమరేఖలు అని కూడా అందురు. ఈ రేఖలవలన భార్యా


113

సంబంధమయిన ప్రేమ అనురాగం, వారి దాంపత్యం ఇత్యాదులు తెలియును కేవలం పెండ్లి వఱకేగా. ఈరేఖలనుబట్టి ఎందరు ప్రేమసంబంధంగా పురుషులు వుందురో లెక్కించు పద్ధతియునూ వుండియున్నది. ఈరేఖవల వారి చాకచక్యం, నేర్పు, చతురత, లౌక్యము, కామం మొదలగు విషయము కూడా తెలియవచ్చును. పొడవుగాను, లోతు గానూ ఉన్న రేఖయే వివాహం సూచించును. సన్నంగా పొట్టిగాఉన్న రేఖలు ఇతర స్త్రీ పురుషసంబంధ యికలను సూచించును.

ఈరేఖ వంకరటింకరగావున్నచో, వారి అనురాగము దాంపత్యమున ఆటంకము కల్గుననియు, ఈరేఖ విమలంగా కాంతివంతముగావున్న ప్రేమా రాగములతో వారిదాంపత్యము బాగుండనియూ తెలియవలెను. ఈరేఖ లోతు ఉండి, బుధస్థానము ఉబ్బెత్తుగావున్న, మంచి ఫలితములు యిచ్చును బాగుగ వివాహరేఖ యోగించును.

యీ వివాహరేఖ అడ్డముగా వ్యాపించి రవిరేఖపై అంత్యముండిన అట్టివ్యక్తి వున్నతమైన స్త్రీనిగాని సుఖాదులు అనుభ వింతురు. ఇది ఒక గొప్పయోగము ప్రక్కనగల 114వ బొమ్మను చూసి తెలుసు కొనగలరు.


114

## సంతాన రేఖలు

అరచేతినందలి బుధవ్రేలు అనగా చిటికెన వ్రేలు క్రిందగల బుధస్థానము పైచేతి చివరి అంచునుండి అడ్డముగా వ్యాపించి వివాహరేఖపై నిలువుగయుండు చిన్న రేఖలను సంతాన రేఖ లుందురు. 115వ బొమ్మను చూడగలరు. సూక్ష్మమయిన రేఖలు లెక్కకురావనియు తెలియ వలెను, అసలురేఖలు లేని కారణంగా సంతానము లేనిదనియు చెప్పడానికి వీలులేదు. తతిమా విషయములనుబట్టి సంతాన బావములు చెప్ప వలెను, లోతైన సంతానరేఖలు వున్నచో సంతానము నిలుచును అని చెప్పవచ్చును.


115



**అర్ధచంద్రాకారపు రేఖ:-** ఈ రేఖ అరచేతియందు చంద్ర,శుక్రస్థానములపై అర్ధచంద్రాకృతిలో ధనరేఖపైగా వంపు తిరగియుండును. ఈ రేఖవలన స్త్రీ పురుషుల యొక్క మనోభావములను. శారీరక కోర్కెలను తెలియవలయును.

**స్నేహ రేఖలు :-** శుక్రస్థానమునందు బొటనవ్రేలికి క్రిందుగావుండి పైకిపోవు రేఖలను స్నేహరేఖలు అందురు. ఈ రేఖలనిబట్టి, మనకు స్నేహితులను, వారికి మనకువున్న మిత్రత్వమును, వాటి (స్నేహ) బలమును సూచించును.

**మాతృరేఖ :-** శుక్రస్థానములో ఆయుష్యరేఖను దగ్గరగా వుండు మొదటి రేఖను తల్లిరేఖ లేక మాతృరేఖ అని అందురు. రెండవరేఖ నుండి తతిమా రేఖలు బంధువులను తెలుపును.

**పితృరేఖ:-** ధనరేఖను ఎడమప్రక్కన రేఖను తండ్రిరేఖ లేక పితృరేఖ అందురు.

# అరచేతిలో వివిధ రేఖలు

**1. దివ్యజ్ఞాన రేఖ:-** ఈ రేఖ అరచేతిలో బుధస్థానముమీద పుట్టి అర్ధచంద్రా కారంగ చంద్రస్థానం మీదకు వ్యాపించియుండును చేతిలో యుండు ఆరోగ్య రేఖనుచూచి దివ్యజ్ఞానరేఖగా భావించరాదు. ఈదివ్యజ్ఞానరేఖ అరచేయి అంచున అర్ధచంద్రాకారములో ఉండి ఉండును, ప్రక్కనగల 116వ బొమ్మను చూసి తెలిసుకోగలరు.


116

అరచేతిలోని వివిధరేఖలలో ప్రధానమైనవి పదహారును. చిహ్నలు-వివిధ గుర్తులు మొదలగునవి సుమారు నూటఅరువదివరకు ఉండునని తెలియుచు న్నది. అందు దివ్యజ్ఞానరేఖ ఎవరిహస్త మందుండునో వారు భూత భవిష్యద్వర్త మానములను జ్యోతిషయము సాముద్రిక శాస్త్రములలో పరిచయము లేకున్నను సులభముగా చెప్పగలుగుదురు, జ్యోతిశాస్త్రము నభ్యసించినవారి హస్తంలో ఈ రేఖయున్నచో, వారు జాతకఫలితములు చెప్పుటలో గొప్పశక్తి గలవారగు

దురు. సాధారణముగా ఈరేఖ కేరళప్రశ్నలు, లకోటాప్రశ్నలు చెప్పువారి చే
లలో కన్పించును.

జ్యోతిషశాస్త్రములోనీ, సాముద్రికముగానీ, అభ్యసింపక కేవలం సోది చెప్పె
వారి హస్తంలలో ఈరేఖ తరచుగా కనబడుచుండును. చేతిలో ఈరేఖ ను
శిరోరేఖ చంద్రస్థానంమీదకు వ్యాపించియున్నచో వీరు జ్యోతిష్యము చెప్పు
లోను గొప్ప ప్రతిభాశాలురగుదురు.

దివ్యజ్ఞాన రేఖయు శిరోరేఖయు స్ఫుటముగాయుండి చంద్ర, బుధస్థానమ
లు ఉచ్చెగావున్నచో-కాళీ ఉపాసన ఉచ్ఛిష్ఠ గణపతి, ఆంజనేయ ఉపాసన మొ
లగువాటిని అభ్యసించి, ప్రశ్నఫలములను అద్భుతముగ చెప్పగలుగుదురు
చేతియందు దివ్యజ్ఞానరేఖ ఉండి, రవిరేఖ, ధనరేఖలు కూడా విమలము
యున్నచో మహారాజ ఆస్థానములలో ఆస్థానసిద్ధాంతలుగ నుందురు. రే
యొక్క ఉచ్చె-నీచలనుబట్టి ఈ "దివ్యజ్ఞానరేఖ" హెచ్చుగను, తక్కువగను
కనబడుచుండును.

**2. వశీకరణరేఖ:-** ఈరేఖ అరచేతిలో శిరోరేఖకు, ఆత్మరేఖకును మధ్యగా కత్తెరవలె ఒకరేఖపై మరియొకరేఖ, కత్తెవాటముగా యుండును. ఈరేఖ ఆత్మ రేఖనుగానీ, శిరోరేఖనుగానీ, ధనరేఖనుగాని తాకకసరిగా ఈ రేఖల మధ్య యుండును. 117వ బొమ్మను చూసి రేఖను తెలిసుకొనగలరు. దీనినే వశీకరణ రేఖ అనియు, కొందరు


117

యోగరేఖ అనియు, మరికొందరు మంత్రరేఖ అనియు అందురు. ఏమైనను
మంత్ర శాస్త్రమబ్బును. ఈ రేఖగలవారు "భూతవైద్యము" సమ్మోహనము
ఇంద్రజాలము మొదలగు రహస్యవిద్యలలో ప్రవీణులుగ నుం దురు
మంత్రశాస్త్రము, యోగవిద్యలు, యోగాసనములు చేయుట, గారడీపనుల
చేయుట మొదలగు వాటియందు నిపుణులై పేరుగాంతురు. ఎనలేని పేరు
కీర్తి సంపాదించగలరు.



**3. మహిమరేఖ:-** ఈరేఖ అరచేతిలో చిటికెనవ్రేలు అనగా బుధవ్రేలు క్రింద బుధ స్థానముపై క్రిందనుండి పైకి వ్యాపించు ఊర్ధ్వరేఖ ప్రక్కనగల 118వ బొమ్మను చూడగలరు. బొమ్మలో పై భాగానగల రేఖను పరిశీలించి తెలిసుకొనగలరు ఈరేఖపై అడ్డురేఖ వ్యాపించి యుండరాదు. మహిమరేఖ చేతిలో స్ఫుటముగ యున్నచో ఏదైనా ఒక శాస్త్రములో గొప్ప పండితుడుగను, చేతిలో స్థానములు రేఖలు విమలముగయుండి, స్ఫుటముగనున్నప్పుడు

118

'మహిమ రేఖ'గలవారు సకలశాస్త్ర పండితులగుచున్నారు, వీరి జీవితము రాజయోగ ప్రసముగ రుండును. రాజాస్థానములలో సన్మానింపబడుచుందురు. ఆస్థాన పండితులుగ నుందురు. అరచేతిలోనుండు వివిధగుర్తులను ఆగుర్తులకు తగు ఫలితములను తెలుసుకోగలరు.

ప్రక్కనగల వివిధగుర్తులు బొమ్మను పరిశీలించి చూడగలరు.



**4. పాశరేఖ:-** ఈరేఖ అరచేతి మధ్యలో శిరో,ఆత్మరేఖల మధ్య(గుండ్రని) సున్నావలె నుండును. బొమ్మలో పైగుర్తుగల రేఖను చూసి తెలిసుకోగలరు. 119వ బొమ్మను చూడండి. దీనిని వలయురేఖ అనికూడా అందురు. ఇది వశీకరణ శక్తిని ఆకర్షణశక్తిని కలుగజేయును. వీరు ఏవృత్తిలోనైనను సులభముగ ప్రజా దరణపొందగలుగుదురు. ఈ రేఖను ప్రక్కన బాగములలో గుండ్రముగా ఉండక


119

చదునుగను, సమానముగను ఉన్నచో, భార్యమూలమున విశేషధనము, ఒ
గృహములు లభించును కోటీశ్వరుడు,లేక మహారాజు కుమార్తెను వివాహమా
అందుమూలమున అత్తవారి ఆస్తిఅంతయు లభించి తద్వారా మహా రాజయో
గముపట్టును. గొప్పయోగవంతమైన విలాసమైన జీవితము గడుపుదురు.

**5. నక్షత్రము:-** ఈరేఖ (నక్షత్రంగుర్తు) అరచేతిలో రెండవ కుజస్థానముపై ఉండును. 120వ బొమ్మను నక్షత్రం గుర్తుగల రేఖను చూసి తెలిసుకొనగలరు. ఈ విధముగా వున్నచో ఇరువది ముప్పై సంవత్సరముల మధ్య కారాగృహశిక్ష కలుగును. ఆ వ్యక్తి ఉద్రేకమయిన కోపస్వభావం కలవారుగను తనకోపము తన శత్రువు అనునట్లు బంధు,


120

మిత్రప్రజావిరోధము కలుగును. కాలక్రమమున పెరిగి ఏకాకియై ఒంటరి జీవించును. సకలజనంరోధము ఏర్పడును. ఎవరినీ లెక్కచేయరు అహంభావత్వము అధికముగ యుండును. దేనియందును రాణించలేరు తుదకు భార్యతోకూడా కలహించును. ప్రతివారితోను ప్రతివిష యమందున కలహించుచూ జీవనము సాగించును.

**6. జలగండము:-** అరచేతిలో యీరేఖ వలయముగా చంద్రస్థానముపై సున్నవలె గుండ్రని రేఖగా (వలయురేఖ) ఉండును. 121వ బొమ్మలోనున్న గుర్తులు రేఖను చూసి తెలిసుకొనగలరు. ఇట్టి గుర్తు చంద్రస్థానమునకు చాలా క్రింద భాగమునవున్నచో బాల్యము నందె జలగండం కలుగును. చంద్రస్థానపు పై


121

భాగమునందున్నచో వృద్ధాప్యమునందు జలగండం కలుగును. ఈ రేఖ గురిం
వివరించినపుడు ఆయుష్యరేఖను గూడా పరిశీలించి ఏవయస్సు నంద
జలగండం కలుగునో నిర్ణయించ వలసియుండును. హస్తమునందు రేఖల
వివిధ గుర్తులు....వాటి ఫలితములు.



**మత్స్యరేఖ:-** యించుమించు చేపవంటి ఆకారములో ఉండును. ఈరేఖ సాధారణ అరచేతిలో దిగువభాగమునందును, ఆయుష్యరేఖ చివరిభాగమునను ఉండును. ప్రక్కనగల 122వ బొమ్మను చూడండి. అంతేకాక అరచేతి మధ్య భాగంను,గురు-శని-రవి,బుధ,కుజ,చంద్ర- శుక్రస్థానము మీదను కూడా ఉండును. ఇది యుండు చోటును బట్టి దానిఫలితములు కూడా


122

మారుచుండును. మత్స్య రేఖ ఎవరిచేతి యందుండునో, వారిజీవితం దినదినాభివృద్ధిదాయకముగ అభి వృద్ధిగాంచుచుండును. మత్స్యరేఖ ఉన్నస్థానంబట్టి వయస్సు నిర్ణయించి, ఆ వయస్సులో ఆకస్మిక ధనప్రాప్తి కలుగుననియు, గొప్ప ధనయోగము కలుగు ననియు ఆవయస్సునందు ఆవ్యక్తికి రాజయోగము పట్టున నియు తెలియ వలయును. ఇది ఒక గొప్పయోగము.

మత్స్యరేఖ జీవితరేఖ చివరిభాగంలో నున్నచో-అట్టి ధనయోగము-రాజ యోగము అరవైసంవత్సరముల వయస్సుదాటిన పిదప కలుగుననియు, ఆ కాలమున ఆవ్యక్తియొక్క జీవితం మహాయోగప్రదముగనుండుననియు తెలియ వలెను. మత్స్యరేఖ ఉన్నస్థానమునుబట్టి వయస్సు నిర్ణయించి, ఆ వయస్సులో గొప్పభవనమును నిర్మించుట, భూసంపాదనరత్నములు-ఆభరణములు సంపాదించుట వాహనసౌఖ్యం కీర్తి కలుగునని తెలియవలెను. మత్స్యరేఖ ఎవరి హస్తము నందువుండునో వారికి దురంధరులైన పుత్రులు కలుగుదురనియు, అట్టి పుత్రులులోకవ్యాప్తమైన కీర్తివంతులగుదురనియు తెలియవలెను. మత్స్య రేఖను గురించి మనమహర్షులు విశేషముగా పొగిడియున్నారు. కొందరి హస్తములలో అధోముఖంగను ఉండును ఊర్ధ్వముఖముగనున్న మత్స్యరేఖ యుక్త వయస్సువచ్చినది లగాయితూ అనగా, పదునెలమిది సంవత్సరాల వయస్సు వచ్చినది లగాయితూ మహాయోగము నిచ్చుచుండుట అనుభవంలో చూచుచున్నాము. అధోముఖముగ ఉన్న మత్స్యరేఖ వృద్ధాప్యమున అనగా యాభై

సంవత్స రములు దాటిన పిదపయోగము నిచ్చుచున్నది. మత్స్యరేఖను గురిం
మనపురాణములలో తరచుగా ప్రస్తావింపబడియున్నది. క్రిందబొమ్మన
చూడండి.

**తులారేఖ:-** ఈరేఖ అరచేతి యందున్నచో మంచి ప్రవర్తనశీలము నత్యసంధత పరోపకారబుద్ధి న్యాయం ధర్మము పాటించు వారుగ నుందురు వీరి జీవితం లోకమునకు ఆదర్శప్రాయమైనదిగా వుండును. ప్రక్కనగల బొమ్మలో తులారేఖగా త్రాసును చూడగలరు. యోగ్యులు పూజనీయులు సకలజనులచే కీర్తింపబడుచు, పూజింపబడుచుందురు. సభాపూజ్యులు. వీరియందు తొందరపాటు వుండక తూచితూచి మాట్లాడుట, పనులుచేయుట వీరికి పుట్టుకతో పుట్టిన సద్గుణములు, న్యాయవాదులహస్తములందును, కలెక్టర్ మొదలగు ప్రజాధికారంగల వ్యక్తుల హస్తములయందును, ఈరేఖబాగుగా కనబడుచున్న గొప్ప పట్టుదల, కార్యనిర్వహణ శక్తి వీరియందు ప్రస్ఫుటమగుచుండును. ధర్మము కొరకై వీరు తమ ప్రాణాలను అర్పించుటకు కూడా వెనుకాడరు. అట్టి రేఖలు గలవారు నిజప్రవర్తనచే లోకమున శాశ్వతమైన కీర్తిని సంపాదించగలుగుదురు.



**సూర్యరేఖ, చంద్రరేఖ:-** ఈరేఖలు తరచుగా చాలా హస్తములలో కనబడుచుండును. చంద్రరేఖ అనునది గుండ్రముగా-వలయాకారమున నుండును. చంద్రరేఖ-అర్ధచంద్రాకారముగా నుండును. చంద్రసూర్యరేఖలు గలవారు మంచి ప్రవర్తనగలవారును యోగ్యులును మేధావంతులును కీర్తిపొందువారును, ఐశ్వర్యవంతులును అగుదురు. ఇట్టి రేఖలు యోగములను కలుగజేయును.

**చామరము:-** వింజారమువంటి ఆకారములో నుండును ఫలితముకూడా పేరుకు తగినట్లే ఉండును. ధర్మగుణం-పరోపకారబుద్ధి కలవారగును. దేవాలయములను-సత్రములను నిర్మించువారగును ఉందురు. వీరు పుట్టుకతోడనే ఆగర్భ శ్రీమంతులుగ జన్మింతురు. ఛత్ర,చామరాదులు, రాజాలాంఛనములుగ అందుచే వీరి జీవితము రాజయోగప్రదముగ నుండునని భావము జీవితములో గొప్పయోగములు కలుగును.



**మాలారేఖ:-** (పూలమాలవలె వుండుటచే మాలారేఖ అనిఅందురు) ఈ రేఖ అతిసూక్ష్మ రేఖలతో గుండ్రముగా మాలవలె) యుండును. ఇట్టి రేఖ గలవారు విశేషధనవంతులగుటయేగాక, సకలజనులచేతను విశేష గౌరవముగ చూడబడుచుందురు సంఘజీవితములో గౌరవముగా కాలము గడుపుచుందురు. గ్రామపంచాయితీ ప్రెసిడెంట్ల హస్తములందును సమితి ప్రెసిడెంట్ల హస్తములందును జిల్లాపరిషత్తు ప్రెసిడెంట్ల హస్తములందును ఈరేఖ తరచుగా కన్పించుచున్నది కీర్తి ప్రతిష్టలు గౌరవము హెచ్చుగా వుండును.

శక్తి,తమరము, ఖడ్గము, బాణము, విల్లు మొదలగు గుర్తుల ఆకారములో నుండు రేఖలు అరచేతిలో వున్నచో పోలీసు మిలటరీశాఖలలో మొదట సామాన్యమయిన ఉద్యోగములో ప్రవేశించి, స్వల్పకాలములోనే మిక్కిలి వున్నత పదవులనుపొంది విశేష అభివృద్ధి పొందుదురు. గొప్ప మేధావంతులుగ నుందురు. ఈ విధముగా అరచేతిలో ప్రముఖమైన నలుబదినాలుగు గుర్తులకు సంబంధించిన రేఖలువున్నవి అందు కొన్ని ముఖ్యమైన వాటికి మాత్రమే ఫలితములు తెలికొనగలరు.

# అరచేతిలో స్థానములు-ఫలితములు

చేతివ్రేళ్ళ క్రింద ఎత్తుగను, మృదువుగను ఉండు ప్రదేశములు స్థానములు అని చెప్పబడును. అరచేయిభాగమును గురుస్థానము, శనిస్థానము,రవిస్థానము బుధస్థానము,చంద్రస్థానము, శుక్రస్థానము, మొదటి-రెండు-మధ్య కుజస్థానము అని తొమ్మిది భాగములుగా విభజించియున్నారు.

1. చూపుడువ్రేలు అనగా గురువ్రేలు, దీని క్రింద ఎత్తుగానుండు ప్రదేశం గురుస్థానము.
2. మధ్యవ్రేలు అనగా శనివ్రేలు, దీని క్రింద ఎత్తుగానుండు భాగము శని స్థానము.
3. ఉంగరపు వ్రేలు అనగా రవివ్రేలు, దీనికి క్రిందనుండు ప్రదేశము రవి స్థానము.
4. చిటికెనవ్రేలు అనగా బుధవ్రేలు దీనికి క్రింద ఎత్తుగనుండు ప్రదేశము బుధస్థానము.

5. బుధస్థానము క్రిందనుండు ప్రదేశంను మొదటి కుజస్థానము అందురు.
6. ఆ మొదటి కుజస్థానము క్రిందనుండు ప్రదేశం చంద్రస్థానంఅనిఅంద
7. గురుస్థానము క్రిందనుండు ప్రదేశమును రెండవకుజస్థానంఅనిఅంద
8. అరచెయ్యి మధ్యగొయ్యిగా(పల్లంగా)నుండునది మధ్యకుజస్థానం అందురు.
9. రెండవ కుజస్థానం క్రింద అనగా బొటనవ్రేలు క్రింద ఎత్తుగ నుండు శుక్రస్థానం అని అందురు.

సాముద్రికశాస్త్రములో యీస్థానములకు విశేషప్రాముఖ్యత యివ్వ బ ఈస్థానములనుబట్టి జీవితం యోగదాయకంగనుండునో, సామాన్య నుండునో తెలుసుకొను ఉపాయములు సాముద్రికశాస్త్రములలో విపుల చెప్పబడెను. అరచేతిలో కేవలము రేఖలను బట్టియే ఫలితములు నిరూ రాదు. రేఖలను బట్టి ఫలితములు చెప్పునపుడు ముఖ్యముగా ఈ స్థానము బాగుగా పరిశీలించవలయును. స్థానములను పరిశీలింపక రేఖలను బట్టి ఫలితమును నిర్ణయించిన అట్టి ఫలితములు ఋజావుగనుండక, తప్పిపో అందుచే హస్తమునందు స్థానంలకు కూడా ప్రాధాన్యంకలదు.

అరచేతిలో స్థానములు ఎత్తుగను, (ఉచ్ఛగను)ఉబ్బెత్తుగను ఉండక, గు పడినట్లుపల్లవల (నీచ)గను, లోతుగను ఉన్నచో-అరచేతిలో మంచి యోగ నిచ్చు రేఖలు ఉన్ననూ జీవితములో ఆశించిన అభివృద్ధిని పొందలేరు. జీవిత సామాన్యముగనే వుండును. అందుచే బాగుగా గ్రహించవలెను.

**గురుస్థానము:-** ఇది చూపుడు వ్రేలు క్రింద వుండును. ఇది అరచేతిలో నుండు స్థానం లన్నింటిలో చాలా ప్రాముఖ్య మయినది గురు స్థానము ఎత్తుగను ఉచ్ఛగను విశాలముగను నున్నచో ఆవ్యక్తి గురు వ్యక్తియనబడును. 123వ బొమ్మను చూచి గ్రహించగలరు. వీరు మేధావంతులుగను, విద్యావంతులుగను, వేదాంతులుగను, దేవభక్తి-మంచి ప్రవర్తన


123



మొదలగు సలక్షణములతో విరాజిల్లు చుందురు. వీరు రాజకీయవేత్తలుగను, మంత్రులుగను, దేశనాయకులుగను, వుందురు. వీరిలోకొందరు గవర్న మెంటులో పెద్ద ఉద్యోగములలో నుందురు.

వీరు ఉత్తమజీవితము, ఉత్తమస్వభావములతో విరాజిల్లుచుందురు. కొందరు మతసంస్థలలో పీఠాధిపతులుగను మరికొందరు విద్యాసంస్థలలో వున్నత పదవులందును వుందురు నిత్యము జపములు మొదలగు సత్కర్మలా చరించుచూ దైవకార్యములు చేయుచూ మానవులలో ఉత్తమశ్రేణికి చెందిన వారుగనుందురు. ఉత్తములైన, యోగప్రదులైన కుమారులు గలుగుదురు. సంఘములో పేరు ప్రతిష్టలు సంపాదింతురు.

గురుస్థానము నీచగా (అనగా పల్లముగా)వున్నచో సోమరియు, నీచమైన ప్రవర్తన గలవాడును, గర్వముతో నుండువాడును, మోసములుచేసి ధనార్జన చేయువాడును డాంబికుడును కులాచారము పాటించనివాడును దైవముపై నమ్మకము లేనివాడును, జీవితము నిరర్థకముగ గడిపి వేయువాడును. నిత్య జీవితముకూడా జరగక కష్టనష్టములు పొందెవాడగును. జీవితము కడుదుర్భ రముగా గడుపుచూ మనోదౌర్బల్యము పొందువారగుదురు.

## గురుస్థానముపై రేఖలు- వాటి ఫలితములు

గురుస్థానము మీద కత్తెరగుర్తుగల రేఖ యున్నచో దాంపత్యజీవితము సుఖప్రదముగా నుండును మోహనవతియు,గుణవతియు, తనపై విశేష ప్రేమాతి శయముతో యుండునట్టియు భార్యలభించుటయేగాక-అట్టి వనితను వివాహం చేసుకొనినదిలగాయితు జీవితం దినదినాభివృద్ధిగా యుండి సౌఖ్యప్రదముగ నుండును. అందుచే గురుస్థానముపై కత్తెరగుర్తు అదృష్టము యిది ఒక యోగము అనే చెప్పవచ్చును.

ఈస్థానముపై నక్షత్రమునంటి గుర్తులుగల రేఖవున్నచో హఠాత్తుగా ఔన్నత్యము, మంత్రి మొదలగు గొప్పపదవులు కలుగును. ఒకకత్తెరయు, నక్షత్రమువున్నచో భార్యవలన విశేష ధనలాభము, చరస్థిరరూపమయిన ఆస్తులు, ఔన్నత్యం కలుగును. వృత్తము(సున్న)గుర్తుగల రేఖవున్నచో విజయప్రదమయిన

జీవితమును. చతురపు రేఖవలన గృహనిర్మాణ కార్యసాధనాశక్తి, ఉ పదవులు, కీర్తి కలుగును. ఒక కత్తెరయున్న అనుకూలదాంపత్యము, ఒక నిల రేఖ వున్నయెడల జీవితములో మంచి అభివృద్ధిని సాధింతురు.

**శనిస్థానము:-** ఇది మధ్యవ్రేలు క్రింద వుండును 124వ బొమ్మలో శనిస్థానం చూసి తెలుసుకోగలరు. శనిస్థానం ఉచ్ఛెగావున్నచో, ఓర్పుగలవారును, ఒంటరి తనంగా నుండ గోరేవారును, లోభియు స్థిరచిత్తము గలవారును, స్వశక్తిపై ఆధారపడి జీవించు వారును, వేదాంతమగును. అరచేతిలో శనిస్థానము ఉచ్ఛెగా యున్నచో శని వ్యక్తి అనబడును. ఇందును గురించి వివాదం కలుగు చేతిలో శనిస్థానం ఉచ్ఛెగా వుండ రాదని కొందరు తలంచుచున్నారు.


124

శనిస్థానము ఉచ్ఛెగా యుండుట మంచిదేగాని చెడ్డదిగాదు, శనిస్థాన ఉచ్ఛెగావున్నచో, వ్యవసాయ మూలమున అభివృద్ధి చెందుదురు. మంత్రము, యోగశాస్త్రము, రసాయనము, వైద్యము, గణితము, అర్ధశాస్త్ర లలో శోభిల్లువాడగును, వేదాంతయగును. బొగ్గు,నూనెగనులు వగైరా కనిపెట్టుటలో సహజశక్తి సంపన్నులుగ నుందురు శనిస్థానము ఉచ్ఛెగాయు పూర్ణాయుర్దాయము కలుగును. శని వ్యక్తులకు యీ స్థానము ఉన్నతము యుండును.

**శనిస్థానము నీచముగా వున్నచో:-** సేవకావృత్తులచే జీవించును. సం జీవితములో ఎవరతోను కలిసిమెలిసి వుండక ఏకాంతజీవనం గడుపును, వాజకుడగును, అనగా సన్యాసయోగము పట్టవచ్చును. కుటుంబసౌఖ్యం వాడును. భూతవైద్యము మొదలగు క్షుద్రవిద్యలు అభ్యసించి, తన్మూలం జీవితము గడుపును, శనిస్థానము నీచపడుట దురదృష్టము. త్రాగుడు, జూద వ్యభిచారము మొదలగు దుర్వ్యసనములలో చిక్కుకొని నీచప్రవర్తన గలవా గును, వీరు తరచుగ ప్రమాదములకులోనై అకాలమరణము నొందుదురు.



# శనిస్థానముపై రేఖలు-వాటి ఫలితములు

ఈస్థానముపైన నక్షత్రమువంటి గుర్తుగల రేఖ దరిద్రమును, పక్షవాత మును, అనివార్యముగు దీర్ఘరోగములను అకాలమరణమును సూచించును. త్రిభుజము, యోగశాస్త్రమును, మంత్రశాస్త్రములలో ప్రవీణత కలుగజేయును. వృత్తం (సున్న) వ్యాపారమూలమున ధనలాభము కలుగుజేయును. త్రిశూల రేఖచే గొప్ప వేదాంతమగును. కత్తెర రేఖచే సంతానం లేకపోవుట ఆకస్మిక విపత్తులు, యోగశక్తులను దుర్వినియోగము చేయుట, పుట్టుమచ్చ దరిద్రమును. ఆపదను కలుగజేయును. యీ స్థానముపై ఊర్ధ్వరేఖవున్నచో గొప్ప అదృష్టమును సూచించును జల్లెడవంటిరేఖ దరిద్రము,కష్టంలు కారాగృహప్రాప్తిం సూచించును.

**రవిస్థానము:-** ఇదివుంగరపు వ్రేలు (రవివ్రేలు) దిగువున వుండును. దీనిని రవిస్థానము అని అందురు. 125వ బొమ్మలో రవిస్థానమును చూడగలరు.


125

**రవిస్థానము ఉచ్ఛెగాయుండిన:-** ఈస్థానం ఉచ్ఛెగాను, విమలంగాను యుండిన రవివ్యక్తి యనబడును. ఈ స్థానము మేధాశక్తి, విద్య, కీర్తి విశేష ధన యోగము అవగాహనము, కార్యసాధనాశక్తి నిపుణత, స్వేచ్ఛాజీవనము సర్వజన వశీకరణశక్తి, విజ్ఞానము మొదలగునవి. వీరికి సహజముగ పుట్టుకతోడినే సూచించును. మరియు సమయోచిత సంభాషణము సరళమైన వాగ్ధాటియును వీరికి మంచియోగాలు.

రవిస్థానము విద్యాస్థానమని కొందరు చెప్పుచున్నారు. ఈస్థానము వున్నతముగ నున్నచో, ఐ.ఎ.ఎస్. పరీక్షలలో ఉత్తీర్ణులగుచున్నారు. కొందరు గవర్నమెంటు పదవులలో వున్నత శ్రేణిలోనున్నారు. ఈ స్థానము ఉబ్బెత్తుగా (ఉచ్ఛెగా వుండుట అదృష్టమే).

**రవిస్థానము నీచగావున్నచో:-** సదాఅపజయములు పొందుచూ సామాన్య జీవితంను కలవారుగను. లేదా దరిద్రులును, వెలుగులేని జీవితము కలవారు గను, అనారోగ్యము కలవారుగను, అల్పులుగాను, అల్పస్వభావము, సుఖము లేనివారుగను అగును.

## రవిస్థానముపై రేఖలు-వాటి ఫలితాలు

నక్షత్రగుర్తు గల రేఖవున్నచో గొప్ప ఔన్నత్యమును కీర్తిని పొందును విశేష ధనసంపాదన, ఉన్నతపదవియు కలుగును. ఈస్థానముపై ధృడమయిన రేఖలుయున్నచో ధనము కీర్తి కలుగును. రెండు రేఖలున్నచో యింకను విశేషమయిన కీర్తి కలవారగును. పుట్టుమచ్చ దరిద్రము, ఆస్తినష్టము. అభివృద్ధి భంగము కలుగజేయును, కత్తెరవంటి గుర్తుగల రేఖచే మంచిస్వభావమును జయప్రదమయిన జీవితం కలుగును. మంత్రశాస్త్రము, జ్యోతిషశాస్త్రములో ప్రవీణులగును. లలితకళలలో ప్రవీణత, వాటిమూలమున ధనసంపాదన కలుగును. జల్లెడవంటి రేఖలున్నచో, డంబము, ఆత్మస్తుతి, చంచలస్వభావము 'అల్పవిద్యాబహుగర్వి'' అన్నటుండును.

**బుధస్థానము:-** ఇది చిటికెనవ్రేలు (బుధవ్రేలు) క్రిందనుండుస్థానము, ఈ స్థానమును బుధస్థానం అని అందురు. 126వ బొమ్మలో బుధస్థానమును చూడ గలరు. ఈస్థానము ఉబ్బెత్తుగా వున్నచో బుధవ్యక్తి అని తెలిసుకోవలయును. బుధుడు శాస్త్రమునకును, వ్యాపారమునకు కారకుడు, హాస్యరసము వీరికి సహజ గుణము పిత్రార్జితము ముఖ్యమైనను


126

స్వశక్తిచే గొప్ప ధనవంతులగుచుం దురు. వ్యాపారసంస్థలు వ్యాపించి, లక్షలు అర్జింతురు. లేదా కళాశాలలో అధ్యాపకులుగానుందురు. కొందరు అనేక శాస్త్రములలో పాండిత్యం సంపాదించ గలుగుదురు. సహజపాండిత్యము మేధాశక్తి గలవారుగ నుందురు పంచదార మిల్లులు, బట్టలమిల్లులు మొదలగు సంస్థలు నిర్మింపగలుగుదురు. పరిశ్రమలలో వీరికి అభిరుచి ఎక్కువగా యుండును. మంచియోగ జాతకులు, గణితము, వైద్యము మొదలగు శాస్త్రములలో అభిరుచి మెండు, కళలయందు, యోగ విద్యలందుట శ్రద్ధమా చుందురు. నటకులు న్యాయవాదులుగాను కూడా భాసిల్లుచుందురు. గొ మేధాశక్తి గలవారుగా వుందురు.



**బుధస్థానము నీచముగా ఉన్నచో:-** మోసగాడును అసత్యములు చెప్పుటలో నేర్పరిఅగును వీరు సాధారణముగ తమజీవితములో చాలాభాగము కారా గృహములలో గడుపుచుందురు. మాయలు,మోసములు, దొంగతనములు చేయుచూ కాలముగడుపుచూ వ్యాపారముచేసి తమ ఆస్తినంతయు నష్ట పెట్టుకొని బికారులై తిరుగుచుందురు.

## బుధస్థానముపై రేఖలు-వాటి ఫలితములు

పుట్టుమచ్చవలన వర్తకములో నష్టమును, కత్తెరగుర్తు గల రేఖవలన హాస్యరసమును, వ్యాపారములో మాయోపాయములుచేసి ధనసంపాదనయు చేయుదురు. వృత్తము (సున్న గుర్తువల విషప్రయోగముచే మరణమును, త్రిభుజము గుర్తు రేఖవలన కుశాగ్రబుద్ధియును రాజకీయములలో జయమును మరియు ఒక శాస్త్రములో పాండిత్యమును సూచించును.

**కుజస్థానము:-** ఇది బుధస్థానమునకు క్రిందుగా వుండును. దీనిని మొదటి కుజ స్థానము అనియూ అందురు. కొందరు దీనిని 2వ కుజస్థానంగా చెప్పుచు న్నారు. ఇది అరచేతి అంచునవుండును, 127వ బొమ్మను చూడ గలరు. ఈ స్థానము మానసిక సంబంధ మయిన ఫలితాలను తెలియజేయును.


127

కుజస్థానము ఉబ్బెత్తుగావుండి బొటనవ్రేలు మొదటి పర్వము కూడా పొడవుగా యున్న కుజవ్యక్తులనబడును, వీరికి ధైరోత్సాహంలు మూర్తీభవించియుండును. కలహప్రియులు యుద్ధప్రియులు. తమకార్యములను పరాక్రమముజూపి నెరవేర్చు కొందురు, వీరు సేనానాయకులుగను, పోలీసు శాఖలలో పెద్దఉద్యోగంలను ఆక్రమించియుందురు, ప్రజానాయకులుగ ఉండి కీర్తిని పొందుచుందురు బలమయిన శరీరము గలవారుగ నుందురు. మంచి రూపవంతులుగను, చూచువారికి భయముకలిగించు శరీరసౌష్టవము గలవారుగను నుందురు. పౌరుషమే వీరికి ప్రధానము, ఎవ్వరికినీ లొంగరు. కానీ పరోపకారమునకును, దేశసేవకును, తను ప్రాణములు గూడా అర్పించుటకు సిద్ధమగుదురు త్యాగబుద్ధి కలవారుగా నుందురు.

కుజస్థానము నీచముగావున్నచో పిరికివారగును మీరు క్రూరులుగను దుర్మార్గులుగను, కోపమువచ్చిన ఓర్పుకొనక ఖునీలు చేయుచూ నరహం కులుగా తయారుగుచూ ఏ పనియు చేయక రౌడీలవలె తిరుగుచూ, అన్యులన బాధించుచుందురు, వ్రణస్పోటక కుష్టువ్యాధులకు లోనగుదురు.

**రెండవకుజస్థానం:-** గురు, బుధ స్థానము క్రిందుగా బొటనవ్రేలుకు కుడి ప్రక్కగా వుండును. దీనినే రెండవ కుజ స్థానము అని అందురు. దీనిని కొందరు మొదటి కుజస్థానం అనికూడా అందురు. యీస్థానము శరీరక సంబంధమయిన విషయములు తెలియజేయను. ప్రక్కగల 128వ బొమ్మను చూడండి.


128

## 1,2 కుజస్థానముపై గల రేఖ-వాటి ఫలితములు

నక్షత్రమువంటి గుర్తుల రేఖలున్నచో, హంతకులగను కారాగృహ కలుగును. పుట్టుమచ్చకి-కలహములతో గాయములు తగులును. త్రిశూలము న్నచో యుద్ధములలో మహావీరుడైన పోరుగాంచును లేదా పోలీసుశాఖలో ఉన్న పదవి కలుగును చిన్నచిన్న రేఖలు జల్లెడవలె అల్లిబిల్లిగా అల్లుకుని యున్న ఉబ్బసవ్యాధియు, రక్తసంబంధమైన వ్యాధులు కలుగును. త్రిభుజరేఖలుయు యుద్ధములందును. ఆటలయందును ప్రవీణులై కీర్తిగాంచును. కత్తెరగుర్తుగ రేఖవలన దుస్సాహసములతో ప్రవర్తించుచూ, ఇతరులను అనేక విధముల హింసించుచుండును.

**చంద్రస్థానము:-** అరచేతిలో ఎడమవైపుగాను, మొదటి కుజస్థానము దిగువను గల స్థానమును చంద్రస్థానము అని అందురు. 129వ బొమ్మలో చంద్రస్థాన మును పరిశీలించి చూడగలరు. చంద్రస్థానం ఉచ్ఛెగావున్నచో (ఉబ్బెత్తుగా, అత్యున్నతముగా నుండి చంద్ర వ్యక్తి అనబడును. ఇది ఉచ్ఛెగాయున్న గొప్ప


129



మేధాశక్తి సంపన్నుడు, గొప్ప ఆలోచనాశక్తి గలవాడును అగును, మత విషయములో పట్టుదలకలవాడును. మతగ్రంథములు, పురాణములు, శాస్త్రములు చదువుచుండువారును అగును. స్వలాభాపేక్షయే ప్రధానముగ భావించును. బద్ధకస్తుడై, ఏ కార్యమును క్రియరూపముగా చేయక గాలిలో మేడలు కట్టుచుండును. మంచిస్వభావమును కలవాడును సంఘజీవితములో వుత్తముడని కీర్తిని గావించువాడును అగును. సముద్రప్రయాణము చేయుదురు. కొందరు నావికావృత్తి చేపట్టుదురు, ఉద్రేక స్వభావముగా భావప్రపంచ సంకేతములో మునిగి తేలుచుందును కళలలో రాణింతురు. చంద్రస్థానము నీచముగా ఉన్నచో (యీ స్థానతా పల్లంగా యున్నచో)జలగండం కలుగవచ్చును చపలచిత్తం. స్వార్దపరత్వము'సోమరి తనము అవిశ్వాసము, వీరికి పుట్టుకతోడనే వచ్చునట్టి స్వభావలక్షణములు వాగ్దానములు రెండు. ఆచరణశూన్యము, ఆలోచననేగాని ఆచరణ వుండదు భూతప్రేత పిశాచభయము, వీరికి ఎక్కువగా వుండును.

**శుక్రస్థానము:-** బొటనవ్రేలు క్రిందనుయుండు భాగమును శుక్రస్థానము అని అందురు. 130వ బొమ్మలో శుక్రస్థానమును చూసి తెలుసుకోగలరు.

**శుక్రస్థానము ఉచ్ఛెగావున్న:-** ఈస్థానము విమలముగా, ఉబ్బెత్తుగను, విశాలముగను యున్నచో ఆవ్యక్తులను శుక్ర వ్యక్తు లనవచ్చును. శుక్రస్థానము బలముగాయున్న సంగీత, సాహిత్యములలో పండితుడును, నృత్యము, నాటకము మొదలగు కళలలో గొప్ప పేరు సంపా దించువాడును, స్త్రీలోలుడును అగును, ఈ వ్యక్తు లను స్త్రీలు కోరి ప్రేమించుచుందురు. శుక్రుడు కళత్రము (అనగా


130

భార్య) విద్య, జ్యోతిశాస్త్రము, సినిమారంగము, అన్యస్త్రీ సంపర్కము, స్త్రీలతో సరససల్లాపములు మొదలగు వాటికి కారకుడు. వీరు సభలలో ఉపన్యాసము లిచ్చుటలో గొప్ప వాక్చాతుర్యము గలవారును. గొప్ప వ్యక్తులుగను వుందురు. గొప్పకవులుగా నుందురు. మృదువైన మనస్సు గలవారుగను వుందురు. "నొప్పింపక తానొప్పక తప్పించుకు తిరుగువా"రుగను వుందురు, వీరిలో

కొందరు గొప్పశిల్పులుగ వుందురు. మరికొందరు చిత్రలేఖమున పేరుగాంచిన వారుగా నుందురు. మరికొందరు సినిమాలలో నటకులై లక్షలు అర్జించి పేరుప్రతిష్టలు సంపాదించగల్గుదురు. వీరియందు కామేచ్ఛ అధికముగా యుండును.

**శుక్రస్థానము నీచగావున్న:-** యీస్థానము నీచగా(పల్లముగా)వున్న సుఖ వ్యాధులచే బాధపడుచుందురు. భార్యసౌఖ్యము, కుటుంబసౌఖ్యం ఉండదు. భార్యతో కలహం ఏర్పడి ఒంటరిజీవితము గడుపుచుందురు. పురుషుల స్త్రీల ఎడల నీచబుద్ధితులు పురుషులయెడలస్త్రీలు నీచపద్ధతులు అవలంభించుదురు.

**మధ్యకుజస్థానము:-** అరచేయిమధ్యగా అన్ని స్థానముల మధ్యగా వుండును. దీనిని మధ్యకుజస్థానము అందురు. మొదటి కుజస్థానము రెండవ కుజస్థానముల ఫలితాలను యీమధ్య కుజస్థానమునకు కూడా వర్తించునని తెలియవలెను. యిందుకుగాను 131వ బొమ్మను చూడగలరు. అరచేతిలో అన్ని స్థానములు, అత్యున్నతముగ ఉండి అరచేయి మృదువుగా, గులాబీ పుష్పమురంగులో వుండి హస్తం సువిశాలముగా యున్నచో మహారాజయోగము, అఖండ సామ్రాజ్య యోగము మొదలగు గొప్ప యోగములు పట్టును.


131

# వ్రేళ్ళు-వాటిపైగల రేఖలు-వివరములు

హస్త పరిశీలనవల్ల మానవుని నడవడిక శీలము అదృష్టము స్వభావము, తరతరాల సాంప్రదాయం సంఘ జీవితం పరిశీలనవల్ల మానవుని జీవితములోని కష్టసుఖాలు మంచిచెడులు, లాభనష్టములు ప్రమాదములు జీవితము పోకడ మొదలగునవి తెలియును. హస్తరేఖ శాస్త్రమునందు మానవుని హస్తము మూడు భాగములుగా విడదీసి, వాటివాటి ఫలితములను, తెలిసియున్నారు. అవి వ్రేళ్ళు, అరచేయి మణికట్టు, యీ వ్రేళ్ళను మరల ఐదువేళ్ళగా-మొదటి వ్రేలు, చూపుడు వ్రేలు, రెండవది మధ్యవ్రేలు, మూడవది ఉంగరపువ్రేలు, నాలుగువది చిటికెన



వ్రేలు, ఐదవది బొటనవ్రేలుగా తెలిపియున్నారు. మరలా ఒక్కొక్క వ్రేలును మూడు భాగములుగా విభజించియున్నారు గోరులో చేరియుండునది మొదటి భాగము మధ్యభాగము, 'అరచేయి'ని కలుపునది మూడవభాగముగా తెలియ వలయును వీటిని 'కణుపులు' అనియే మనపూర్వులు తెలిపియున్నారు. వీటి ప్రత్యేకతను తెలుసుకొందుము.

# వ్రేళ్ళు - కారకత్వములు

**1. గురువ్రేలు అనగా చూపుడువ్రేలు:-** పొడవుగాయున్నచో ప్రజాధికారము కలుగును, సంఘజీవితములో గౌరవప్రపత్తులు కలవాడును, యోగ్యుడును అగును.

**2. శనివ్రేలు అనగా మధ్యవ్రేలు:-** పొడవుగను లావుగనుయుండిన ఏకాంత జీవితమును కోరుచుండును. ఒంటరిగా యుండును. వ్యవసాయమూలము నను, సేవాకావృత్తివలనను జీవించును, వృత్తి, ఉద్యోగములు లేక కొందరు యితరులపై ఆధారపడి జీవించుచుందురు.

**3. రవివ్రేలు అనగా ఉంగరపువ్రేలు:-** ఇది పొడవుగను ధృడముగను, సౌష్టవముగను ఉన్నచో గవర్నమెంటు ఉద్యోగమువలన జీవించును. రాజకీయ జీవితము సంఘజీవితముతో పేరు, కీర్తులు కలుగును పదిమందిలో తగువులు తీర్చుట రాజకీయములలో కీర్తిగలవారుగను మేధాసంపత్తిగలవారగును.

**4. చిటికెనవ్రేలు:-** వ్యాపారముచేయుట, శాస్త్రముల నభ్యసించుట, మేధాశక్తి కలవారగును, ఈవ్రేలు వంకరలు లేక సాఫీగాయుండి పొడవుగను, సౌష్టము గను వుండవలెను.

**5. బొటనవ్రేలు:-** ఇది దృఢముగను పొడవుగను ఉన్నచో స్థిరమైన బుద్ధిగల వారును మేధావి,పట్టినపట్టువదల కుండువారుగను,కార్యశూరులుగను, చతురు లుగను ఉందురు. బొటనవ్రేలు పర్వములమధ్య "వడ్లగింజ"వంటి రేఖయున్న లేక గోధుమరేఖగాని యుండిన మానవుడు ధన ధాన్యాదిసంపదలు కలిగి నిత్యము మృష్టాన్నభోజనము కలవాడును సుఖప్రదమయిన జీవితము గలవాడును అగును.

వ్రేళ్ళ చివర కణుపులపై శంఖము, చక్రము, కలశము వంటి ఆకారములో సూక్ష్మరేఖలు గుండ్రముగ తిరిగి యుండును. రేఖలు కుడినుండి ఎడమకు

తిరిగియున్న అది సవ్యచక్రము అనబడును. ఎడమనుండి కుడికి తిరుగుచున్నట్లుండిన అపసవ్యచక్రము అనబడును. చక్రములు, శంఖములు, కలశములు అపసవ్యముగ తిరుగుచున్న రేఖలలో యేర్పడిన మొదట కొంతకాలము యెగించి తరువాత యోగభంగము కలుగజేయును. సవ్యచక్రములు-జీవిత కాలము యోగప్రదముగా నుండును. సూక్ష్మరేఖలు గుండ్రముగ సుడులు తిరిగి శంఖమువంటి ఆకారముతో ఉన్న అవి శంఖరేఖ అనబడును.

చక్రములు వ్రేళ్ళచివర కణుపుల మీదనేగాక అరచేతిలో కూడా వుండును. అట్టి చక్రములు అవి యుండు స్థానమును బట్టి పేరు ఫలితములనిచ్చును. సూక్ష్మరేఖలు గుండ్రముగా వంపులు తిరిగి కలశ ఆకారములోఉన్న అవి కలశ రేఖ అందురు. అట్టి రేఖలు కొంచెము పొడవుగాయుండి గుండ్రముగా వంపులు తిరిగియున్నచో అవి శాపరేఖలు అనబడును. ఈ చక్ర, శంఖ,కలశ శీఫ, పద్మ రేఖలు హస్తములో ఎక్కడైననూ సూక్ష్మరేఖలతోగానీ, పెద్దరేఖలతోగానీ, ఏర్పడి యుండవచ్చును. ఇది స్పష్టంగా దృఢమయినరేఖలతో ఏర్పడినపుడు మంచి ఫలితంలనిచ్చును.

## చక్రములు-శంఖములు-వాటి ఫలితములు

చేతివ్రేళ్ళ చివరభాగములలో ఒక చక్రముండిన ఎల్లప్పుడును సుఖము ననుభవించువాడును రెండుచక్రంలుండిన రాజపుత్రుడును, మూడు చక్రములుండిన ధనాఢ్యుడును, నాలుగు చక్రములుండిన దరిద్రుడును, ఐదు చక్రములుండిన స్త్రీలోలుడు, ఆరు చక్రములుండిన కాముకుడును, ఏడు చక్రములుండిన సౌఖ్యం లనుభవించువాడును, ఎనిమిది చక్రంలుండిన సదారోగములచే బాధపడుచుండువాడును, తొమ్మిది చక్రములుండిన భూమిని పాలించువాడును,పదిచక్రంలుండిన యోగం కల్గి గొప్ప'యోగి'అని తెలిసుకొనవలయును.

ఒక శంఖముండిన సౌఖ్యము అనుభవించువాడును. రెండు శంఖములు కలవాడు దరిద్రుడును, మూడు శంఖములు కలవాడు గుణహీనుడును, నాలుగు శంఖములు గలవాడు బుద్ధిమంతుడును, ఐదు శంఖములు కలవాడు దరిద్రుడును, ఆరు శంఖములు కలవాడు ప్రతిభవంతుడును, ఏడు, ఎనిమిది, తొమ్మిది శంఖములు గలవాడు మహారాజులుగను అగునని తెలియవలయును.



ఒక్కొక్క వ్రేలిమీద వ్రేలునకు మూడు రేఖలతో నాలుగు వ్రేళ్ళలోను మొత్తం పండ్రెండు రేఖలుండిన విశేష ధనవంతుడును భోగముల నుభవించువాడును అగును, నాలుగు వ్రేళ్ళమీదను మొత్తము పదమూడురేఖలుండి నష్టములనుభవించువాడగును వ్రేళ్ళమీదనుండు రేఖలన్నియు లెక్కింపగా పదునాలుగయ్యేనని అతడు మహాసౌఖ్యము అనుభవించువాడును. మహా భోగము లనుభవించువాడు నగును. వ్రేళ్ళమీద రేఖలు పదునైదుండిన చోరుడగును పదునారుండిన జూదగాడగును పదునేడుండిన పాపకార్యము తచరించువాడగును పదునెనిమిది యుండిన ధర్మాత్ముడగును.

## రేఖలయందు వయస్సు నిర్ణయం



**ఆయుష్యరేఖ:-** రేఖలలో నూరుసంవత్స రముల కాలమును గుర్తించుటకు, ప్రధాన రేఖ లయిన ఆయుష్యరేఖ, శిరోరేఖ, ఆత్మరేఖ, ధనరేఖ, రవిరేఖలను ముఖ్య మయినవిగా నిర్ణయించవలెను. యిందు 100సంవత్స రముల కాలమును లెక్కించ వలయును. రేఖలు చిన్నగను, పొట్టివి గను, కురచగను వున్నచో ఈ రేఖపై వయుస్సు నిర్ణయం గుర్తించడంలో జీవితములో జరుగు గండములు, ప్రమాదములు మొదలగువాటిని తెలిసుకొనవలసి యుండును. ప్రక్కనగల బొమ్మను చూడండి.

ముందుగా ఆయుర్దాయము నిర్ణయించడానికి ఆయుష్యరేఖయే ప్రధాన మయినది. బొమ్మలో చూపిన ప్రకారముగా జీవితరేఖకు 100 సంవత్సరములని గుర్తించగలరు. శిరోరేఖ హృదయరేఖపై ఉండు గండములు, వాటి కురచదనముతో ఏర్పడు తక్కువకాలంలో మొదలగునవన్నియు దాటిన తదుపరి మాత్రమే ఆయుష్యరేఖలో చూపబడినట్లు 100 సంవత్సరములు జీవించగలుగును.

ధనరేఖ:- ధనరేఖపై 100సంవత్సరముల కాలము నిర్ణయించడం జరిగింది. అదృష్టరేఖలో వయుస్సు చూపించినా జీవితరేఖయే జీవశక్తికి ఆధారము కంకణ రేఖపై నుండి ధనరేఖ ప్రారంభంకావున ధనరేఖ,శిరోరేఖ కలిగియున్నపుడు

వయస్సు 35సంవత్సరములుగా గుర్తించగలరు. ఇది ఒక్కొక్కహస్తముల ఒక్కొక్కరీతిగా వున్నచో 30 సంవత్సరములనుండి 37 సంవత్సరములవరకు పరిమితి ఉంచుకోవలసియుండును. ఈ ధనరేఖ,ఆత్మరేఖను చేరుకొనునప్పు 55 సంవత్సరములుగా గుర్తించగలిగి ఆపైన మిగిలిన రేఖను 40 లేక 5 సంవత్సరములుగా ధనరేఖగా తెలిసుకోగలరు.

# హస్తరేఖా పరిశీలన-ముగింపు

హస్తమును పరిశీలించునపుడు లేదా పరీక్ష చేయునపుడు పురుషులకు కుడిహస్తమును స్త్రీలకు ఎడమ హస్తమును పరిక్షించి ఫలితములను చెప్పవ యును. స్త్రీలను కుడిచేతిరేఖలు బాగుగానున్నచో వాటి ఫలితములు భర్తకు పురుషుల యెడమచేతి రేఖలు బాగుగాయున్నచో వాటి ఫలితములు భార్యకు అని చెప్పవలయును. స్త్రీ పురుషుల విషయంలలోనూ, రెండు హస్తముల అందలిరేఖలను స్థానములను వివిధగుర్తులను, రేఖయొక్కరంగును పరిశీలిం ఫలితంలు చెప్పవలయును. వీలయినంత శుభఫలితములను చెప్పవలెను మానవ జీవితము బహుకష్టములతో కూడుకొని యున్నది. అందుచే అంద శుభము లను తెలుసుకొనుటకై ఎక్కువమక్కువ జూపుతుండగలరు. హస్తము పరిశీ లించి చెప్పుటకు ఉదయకాలము మంచిదని మనపూర్వులు నిర్ణయించి

పురుషునకు కుడిచేతిలో రేఖయుండి యెడమచేతిలో లేనిచో, ఆ కుడిచే లోని రేఖఫలితములు యిచ్చును. సూక్ష్మరేఖలను స్థానములను చాలా జాగ్రత్తగ పరిశీలించవలెను. హస్తమును పరీక్షించునపుడు బొటనవ్రేలుతో సహా అన్ని వేళ్ళు చూడవలయును హస్తమును పూర్తిగా పరిశీలించి హస్త స్వభావము తెలుసుకొనవలయును. (ఎందుచేతననగా మన పూర్వులు ఈ "హస్తమును" ఏడురకముల హస్తములు చెప్పియున్నారు గనుక)ఎడమ, కుడిహస్తములను వాటియందు గల రేఖలను పోల్చి చూచుకొనవలసియుండును. హస్తములో రేఖలు లోతుగను విమలముగను కాంతివంతముగను వుండుట మంచి ఫలిత ములకు నిదర్శనము అనేక గ్రంధములు చదివిమరిన్ని హస్తములను పరీక్షించిన అనుభవముతో, త్వరపడక ఫలితములను చెప్పుచుండవలయును.



# గొల్లపూడి వారి పుస్తకముల కేటలాగు

**వ్రత కథలు**

| | |
|---|---|
| స్త్రీల వ్రతకథలు (101 వ్రతకథలు) | 14-00 |
| సంపూర్ణ స్త్రీల వ్రతకథలు (200 కథలతో) | 24-00 |
| ఆరు వ్రతములు | 14-00 |
| సత్యనారాయణ వ్రతకల్పం | 14-00 |
| శనివార వ్రతం (వేంకటేశ్వర పూజతో, సుప్రభాతంతో) | 8-00 |
| శ్రీ వైభవలక్ష్మి పూజా వైభవం | 8-00 |
| శ్రీ కుబేరవ్రతకల్పం | 8-00 |
| శివదీక్ష-భక్తిగీతాలు | 18-00 |

**శ్రీషిర్డి సాయి రకములు**

| | |
|---|---|
| శ్రీ సద్గురు సాయి లీలామృతము(క్యాలికో) | 75-00 |
| శ్రీ సాయి లీలామృతము (సాదాప్రతి) | 60-00 |
| శ్రీ సాయి సచ్చరిత్రము | 30-00 |
| శ్రీ షిర్డిసాయి - శ్రీ పర్తిసాయి (పారాయణము) | 65-00 |
| శ్రీ గురు లీలామృతం | 30-00 |
| శ్రీసాయికృప (భగవత్సాధనానుభవములు) | 54-00 |

**పురాణములు, గ్రంథములు**

| | |
|---|---|
| శ్రీమహాభక్త విజయము | 100-00 |
| శ్రీమదాంధ్ర మహాభారతం (బైండ్)వచనం | 150-00 |
| సంపూర్ణ శివమహాపురాణం (బైండ్) | 72-00 |
| అష్టాదశ పురాణం (18 పురాణములు) | 66-00 |
| సంపూర్ణ కార్తీక పురాణము | 25-00 |
| మార్కండేయ పురాణము | 50-00 |
| కార్తీక, మాఘ, వైశాఖ పురాణములు(1కి) | 14-00 |
| శివ పురాణము | 16-00 |
| భగవద్గీత (తాత్పర్యంతో, క్యాలికో బైండ్) | 45-00 |
| గాయత్రీ దివ్యశక్తి (ప్రతీ నామార్థములతో) | 45-00 |
| ఆంధ్ర మహాభారతం-శ్రీ మద్భాగవతము (1కి) | 42-00 |
| శ్రీదేవీ భాగవతం (సులభశైలి వచనం) | 42-00 |
| హనుమచ్చరిత్ర | 28-00 |
| సుందరకాండము (విశేష తాత్పర్యం) | 125-00 |
| నిత్యజీవితంలో భగవద్గీత | 90-00 |
| శ్రీదేవీ మహాత్మ్యం | 25-00 |
| శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి జీవితచరిత్ర | 40-00 |
| విప్రుల ఇండ్లపేర్లు గోత్రాలు, శాఖలు | 50-00 |
| మహాదాత కర్ణ | 40-00 |
| భీష్మ పితామహుడు | 36-00 |

**సహస్ర నామములు, నిత్యపూజా విధానములు**

| | |
|---|---|
| సహస్రనామములు ఒక్కొక్కదానివెల | 8-00 |
| శని పూజాకల్పము (శాంతి విధానాలు, సహస్ర నామాలతో) | 12-00 |
| శ్రీ లలితా సహస్రనామ స్తోత్రమ్ (పూజా విధానం, ప్రతినామమునకు వివరణ, దేవీ స్తోత్రాలతో) | 45-00 |
| శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రమ్ (భాష్యంతో) | 60- |
| లలితా సహస్రనామ పారాయణము | 16- |
| విష్ణు సహస్రనామ పారాయణము | 8- |
| అఖిల దేవతా అష్టోత్తర నామావళి (60) | 10- |
| శ్రీ లలితా కళాప్రకాశము (భాష్యంతో) | 300- |
| సర్వదేవతా నిత్యపూజా విధానం | 10- |

**వివిధ స్తోత్రములు**

| | |
|---|---|
| స్తోత్ర రత్నావళి | 12- |
| సర్వదేవతా నిత్యప్రార్థనలు | 28- |
| లలితా విష్ణు సహస్ర నామస్తోత్రము | 16 |

**బాల బాలికలకు మరియు పెద్దలకు**

| | |
|---|---|
| పిల్లల బొమ్మల మహాభారతం | 25 |
| పిల్లల బొమ్మల వేంకటేశ్వర లీలలు | 25 |
| భట్టి విక్రమార్క కథలు (బైండ్) | 100 |
| సహస్ర శిరచ్ఛేద అపూర్వ చింతామణి (5 ప్రశ్నలు) | 100 |
| భట్టి విక్రమార్క, భేతాళ, తెనాలి రామలింగ, అక్బర్ బీర్బల్ వినోద కథలు ఒక్కొక్కటి | 15 |

**మగవారికి ప్రత్యేకం**

| | |
|---|---|
| వాకింగ్ | 20 |
| స్మాల్‌స్కేల్ ఇండస్ట్రీస్ (G.V.S స్పెషల్) | 50 |
| ధ్యానమ్, శ్రీ గురుజ్యోతి (1కి) | 20 |
| శ్రీమతికి ఒకబహుమతి | 20 |
| రుద్రాక్షమాలలు - అద్భుత శక్తులు | 20 |
| స్మాల్‌స్కేల్ ఇండస్ట్రీస్ (200 పైగా) | 6 |

**జ్యోతిష గ్రంథాలు**

శ్రీ శివల సుబ్రహ్మణ్యంగారి సైంటిఫిక్ సిరీస్:

| | |
|---|---|
| సైంటిఫిక్‌గా జ్యోతిషం నేర్చుకోండి I | 10 |
| సైంటిఫిక్ జ్యోతిషమార్గదర్శిని II | 10 |
| సైంటిఫిక్ జ్యోతిష విన్యాసం III | 7 |
| జన్మకాల సంస్కారము | 6 |
| శ్రీకృష్ణ జైమినీ జ్యోతిషము | 3 |
| సర్వాంతర్యామి జ్యోతిషము | 6 |
| వాస్తు జ్యోతిషాలకు సైంటిఫిక్ ఆధారాలు | 2 |
| దోలనావిద్య | 8 |
| పిరమిడ్ పిరమిడ్ పిరమిడ్ | 10 |
| ఈతరానికి నూరు జ్యోతిష యోగాలు | 7 |
| వర్షప్రవేశ జాతకం | 7 |
| రెమెడీస్ - I | 10 |
| రెమెడీస్ - II, రెమెడీస్ - III 1కి | 15 |
| నవగ్రహ శమనము (రెమెడీస్ -IV) | 7 |
| ప్రశ్నద్వారా జన్మజాతకము (జ్యోతిష గ్రంథము) | 2 |